కాకినాడ నాట్యకళావిజ్ఞాన గ్రంథమండలి

తొమ్మిదవ కుసుమము.

# లంకాపతనము.

శ్రీ అరవిందుని యోగసంకలనము, న్యాసావళి, మహాభారతము, శ్రీకృష్ణావతారము, విహారలీల, వనసుందరి మొదలగు పదినాటకములు వ్రాసిన

మధ్వశ్రీ దాల్తాబాదా గోపాలకృష్ణారావు, B.A. గారిచే

రచియింపఁబడి ప్రకటింపఁబడియె.

మొదటికూర్పు 500 ప్రతులు.

కాకినాడ:

రంగా అండ్ కో., యందు ముద్రింపఁబడియె.

1934.



[వెల రు 1-0-0.

# అంకితము.

సీ॥ ఏనాథు మన్నన । కెనలేక విశ్వముల్
స్వర్గతుల్యంబయ్యె । వసుధనైన
ఏనవ్యభక్తికి । నీడుగానగరాక
యమృతమయంబయ్యె । నవనితలము
ఏపుణ్యమూర్తికి । నేపొద్దుగాంచిన
దాక్షిణ్యమే నిజ । ధర్మమయ్యె
ఏసత్యశీలకు । నిహపరములగల్గ
సత్యవ్రతంబయ్యె । సాధనంబు

గీ॥ అట్టి నాలక్ష్మి నామ య । త్నాంగలక్ష్మి
రామలక్ష్మికి మోదంబు । గాను వేడ్క
సర్వగానుసేను సంప్రీతి । నంకితముగ
రఘుకులాధిపు సత్ప్రీ । రాముకథను.

# నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి.



## రాజపోషకులు.

1 మ॥రా॥రా॥ యన్. బలరామమూర్తినాయుడుగారు,
బి.ఏ., బి.యల్., చెన్నపట్టణం.

2 ,, వారణాసి సీతారామయ్యగారు, బి.ఏ.,
సబ్ మేజస్ట్రీటు, గన్నవరం.

3 ,, శీలంశెట్టి వెంకటరత్నంనాయుడుగారు, డి. పి. డబ్లియూ అసిస్టాంటు ఇంజనీరు, పెన్షన్ లింగారెడ్డిపాలెం.

4 ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు,
చెన్నపట్నం.

5 ,, యన్. వి. సుబ్బారావుపంతులుగారు, బి. ఏ.,
కూటాబువెస్టేటు మేనేజరు.

## పోషకులు.

6 ,, పెండా శ్రీరామకృష్ణయ్య బ్రదర్సు,
జమీందార్లు, కాకినాడ.

7 ,, వారణాసి బాపయ్యగారు, బి. ఏ., క్యాషియరు,
డి. కో. బ్యాంకి, చెన్నపట్నం.

8 ,, అంగర వెంకటసుబ్బారావుపంతులుగారు,
రామచంద్రపురం.

9 ,, మాజేటి మునెయ్యగారు, బి.ఏ., బి.యల్.,
రాజమండ్రి.

10 ,, [illegible] సత్యప్రసన్నం చీరయ్య, బ్యాంకర్సు,
కాకినాడ.

11 ,, దేవులపల్లి విశ్వనాథంగారు, ఆకిరిపల్లి.

12 ,, ధూళిపాళ్ల వెంకటరత్నంగారు, గ్రామమునసబు,
పురుషోత్తపట్నము.

13 ,, దర్భా వెంకటశివరామ రాస్, బి ఏ., బి.యల్.,
కాకినాడ.

14 ,, చెలికాని రామస్వామి బాబుగారు,
అసిస్టెంటు యింజనీరు, సామర్లకోట.

15 ,, అంగర వెంకటకృష్ణారావుపంతులుగారు, ప్లీడరు,
కాకినాడ.

16 ,, కొత్త వెంకటరత్నంగారు, యానాం.

17 ,, దసిగ వెంకటేశ్వరరావుగారు, గుడివాడ.

18 ,, కె. వి. రమణారావుగారు, Representative Confectionery Dept. Parry & Co., Ltd., Madras.

19 ,, జమ్మి వెంకటసుబ్బారావుపంతులుగారు,
Tq. Office, Cocanada.

20 ,, పైడా సూర్యనారాయణమూర్తిగారు,
జమీందారు, బ్యాంకర్సు, కాకినాడ.

21 ,, యం. వి. రాజరత్నంగారు, బి. ఏ., కాకినాడ.

22 ,, శ్రీ జిల్లెళ్ల తిరుమల వెంకటలక్ష్మీబాయమ్మగారు,
Guardian, Minor, Zamindar of Vilasa
Jalamudi etc., Perur.

23 ,, ధరణీప్రగడ బాపిరాజుగారు, కాకినాడ

24 ,, Nandagiri V. Ramadas Pantulu garu.

25 ,, దామోజిపురపు నరసింహారావుపంతులుగారు,
తాడేపల్లిగూడెం.

26 ,, పోలూరి వెంకటప్పయ్యపంతులు, తాణేదారు,
రేపూడి ఎస్టేటు.

27 ,, పులుపుల సత్యనారాయణగారు, నర్సారావుపేట,

28 ,, శ్రీరాజా సురభి మురళీకృష్ణరావు బహద్దర్,
జమీందారుగారు, మెడ్రాసు.

29 ,, శ్రీ వైశ్య బాలస్మృతి గ్రంథాలయం,
నర్సారావుపేట.

30 ,, వేలమూరి కుటుంబరావుగారు, అవనిగడ్డ.

31 ,, లింగం లక్ష్మీజగన్నాధరావుపంతులుగారు, బి. ఏ,
డిప్యూటీ తహశీలుదారు, ఆలమూరు,

32 ,, శ్రీరాజా మల్రాజు వెంకటరామకృష్ణకొండలరావు
బహద్దర్ జమీందారుగారు. కుమారరాజా,
నర్సారావుపేట.

33 ,, నాగసరపు సుబ్బారాయుడు శ్రేష్ఠిగారు,
వైస్-చైర్మన్, మ్యునిసిఫల్ కౌన్సిలరు,
నర్సారావుపేట.

34 ,, చింతపల్లి గోపాలకృష్ణయ్యగారు,
తాలూకాగుమస్తా, నర్సారావుపేట.

35 ,, దిడుగు మల్లిఖార్జునరావుగారు, డిప్యూటీకలెక్టరు
కచ్చేరీ గుమస్తా, నర్సారావుపేట.

# పాత్రలు.

## పురుషులు.

రాముఁడు.
లక్ష్మణుఁడు.
సుగ్రీవుఁడు.
అంగదుఁడు.
హనుమంతుఁడు.
జాంబవంతుఁడు
నలుఁడు.

కపిలాచార్యులు.
రావణుఁడు.
విభీషణుఁడు.
ఇంద్రజిత్తు.
విద్యుజ్జిహ్వుఁడు.
మహోదరుఁడు.
మహాపార్శ్వుఁడు.
గరుత్మంతుఁడు.
ప్రహస్తుఁడు.
ధూమ్రాక్షుఁడు.
బ్రహ్మ.
అగ్నిహోత్రుఁడు.
మాతలి.
అగస్త్యుఁడు.

## స్త్రీలు.

సీత.
సరమ.
దీర్ఘనాస.
లంబోదరి.
శూర్పణఖ.




## నాందీ.

ఉ॥ ఎవ్వని నామధేయమున । కేర్పడెనాదిని వహ్నిబీజమే
ఎవ్వని పేరుకందుదని । యెంచగనిల్చెను శక్తిబీజమే
ఎవ్వని నామసంఘటిత । యోగ్యతఁ దెల్పును జీవకోటికా
ముప్పూరి మూలకారణము । మాహాత్మ్యము బ్రోచుత నెల్లవారికిన్.

(నటీ సూత్రధారులు ప్రవేశము.)

సూత్ర—నటీ! వచ్చితివా? ప్రస్తుతవిషయమేమో తెలియునా?

నటి—నాథా! కల్పనాకథలే నాటకమునకు ముఖ్యమని శంకణముఁ గల్గుకొన్న మీరు పెద్ద పౌరాణికులవుటే ప్రస్తుతవిషయము.

సూత్ర—కాంతా! పదునెనిమిది పురాణములఁ జదువక నొకటి రెండక్కడక్కడఁ జదివి సర్వజ్ఞులమని గర్వించు పండితపుత్రుల మాటలు కట్టిపెట్టుము.

సీ॥ తండ్రిమాటలు నిల్ప । దండకాటవిలోనఁ
గోచరించిన । రాముకెవండో
పత్నికై యెన్నెన్ని । బాములఁబడిపడి
భార్యసాధించిన । భర్తయెవఁడో
వారధిబంధించి । వానరసేనల
నీటుగానడిపిన । నేతయెవఁడో

శరణన్నమాత్రాన శత్రులఁ బ్రోవను
శపథంబుపట్టిన శక్తుఁ డెవఁడొ
గీ॥ చెప్పియసురులఁ గూల్చిన జెట్టి యెవఁడొ
మునుల మోహింపఁ జేసిన మూర్తి యెవఁడొ
ఏకపత్నీవ్రతంబు పాలించె నెవఁడొ
యతఁడె నాకథానాయకుం డతివ కంటె.

సకల సుగుణాభిరాముండగు రామునికన్నఁ గథానాయకుం డెక్కడ లభించు. దీనిని రచించినకవియో కడునేర్పరియని యిదివరకే వన్నెకెక్కినవాఁడు. గాన నాటకంబున కేమికొఱంత?

నటి— ఏకపత్నీవ్రతంబే ముఖ్యమని పాలించిన రామునివంటి నాయకుండు, పరమ పతివ్రతాశిరోమణియగు సీతవంటి నాయికయుండ కొఱతయేమి? కవిమాట యిదివరకే విన్నాము.

సీ॥ సంస్కృతాంధ్రంబులఁ సమముగాఁ జదివిన
చదువర్లలో మంచి చదువరితఁడు
యాంగ్లేయభాషలో నాధిక్యతనుగోరి
బియ్యేపరీక్షయ్యె నెగ్గెనితఁడు
లావుసుశీలావిలాసంబు మృదుశైలిఁ
వ్రాసిన శృంగార రాశియితఁడు
పురుషోత్తమజ్ఞాన పుంగవుశిష్యుఁడై
నిగ్రహంబొసఁగిన నేర్పరితఁడు
గీ॥ పుణ్యపురుషవర విజాపురపు సుబ్బ
రాయ దౌహిత్రి సుగుణాభి రాముఁడితఁడు
తండ్రి గోవిందరావు సద్గతికిఁబోవ
తల్లి లక్ష్మాంబ పెంచిన ధన్యుఁడితఁడు.

సూత్రి— దాల్తాబాదు వంశాంబుధిసోముండై లక్ష్మాంబ గర్భ

శ్రీశుక్తిముక్తాఫలంబై గోపాలకృష్ణరాయాఖ్యంబరగు నీకవి కృష్ణా గోదావరీ గుంటూరు మండలంబుల వన్నెకెక్కినవాఁడు.

(నైపద్యమున)

హనుమంతుఁడు—ఓరోరి రావణహతక, రాక్షసవంశ మహోదధి బడబానలంబ, సీతాపహరణజనిత గర్వవిదూర—

ఉ॥ తాటకఁగూల్చెనే శరము ధాటి సుబాహునిగోటమీటెనే
గాటపుఁగోల, దానవుల గట్టి ఖరాదులనీల్గనేసెనే
యీటె, దురాత్మువాలియురమేశరఘాతము గాడిజేసెనా
సూటిగలట్టి బాణమిదె నూచెదుఁగాంతు దశాస్యనీకునై.

(తెరంగధ్వని)

సూత్ర—అల్లదుగో హనుమంతుండు రావణునిపై క్రోధావేశంబున సముద్రతీరంబునకు వచ్చుచున్నాఁడు. మనమిట నుండరాదు. పోదమురమ్మా.

(నిష్క్రమించుచున్నారు.)

ఇది ప్రస్తావన.






ప్రథమాంకము — మొదటిరంగము.

సముద్రతీరము.

(హనుమంతుఁడు క్రోధముతో)

హను—

ఉ॥ తాటకఁ గూల్చె నేశరము, ధాటి సుబాహుని గూలమీటెనే
గాటపుకోల, దానవుల గట్టి ఖరాదులనెల్ల జేసెనే
యీటె, దురాత్మువాలియుర మేశరఘాతము గాడిజేసెనా
నాటిగ లక్ష్మి బాణ మిదె మా కెదు కాంచె శరాగ్ని సన్నై.

(రాముఁడు, సుగ్రీవుఁడు, లక్ష్మణుఁడు, జాంబవంతుఁడు,
కపిలుఁడు, అంగదుఁడు ప్రవేశము.)

రాముఁడు—ఆహా! ఊర్మివీచిక్షోభము!

గీ॥ ఒకటినొకటి నెదుర్కొని యుయ్యెలాడె
వీచిమాలలు కలయుచు వేడ్కఁ జూపు;
పారవశ్యత దంపతుల్ పరమప్రీతి
నెంతొ యాలింగనంబొనరించు రీతి.

కపిలుఁడు—వహ్వా! దిక్కాంతసముద్రంబను పెద్దసానపై సేనయూర్మిమహాస్తంబుల ఫేనంబను గంధంబుఁ దీసి చంద్రునకుఁ బూయుచున్నదా యేమి!

సుగ్రీ—దంధణాయని మోయుచు దండునకు వీరావేశము నొసగెడు రణభేరిచందంబున యీసముద్రఘోష ప్రబలుచున్నది.

కపి—తెల్లవారుఝామున సోదిచెప్పు బుడబుక్కలవాని బుడబుడయను ఢక్కావలెను, భోగముసానివెనుక తకతకలాడు మద్దెలవలెను, పప్పులు పాయసము, మండిగెలు, సోమాసి, చిత్రాన్నము దధ్యోదనము మిక్కుటముగ మెక్కి తబ్బిబ్బులాడు బ్రాహ్మణార్థపు బ్రాహ్మణునికడుపులో గుబగుబలాగునను, సముద్రఘోష యంతకంత కెక్కువగుచున్నది.

జాంబ—ఇది సముద్రముకాదు. జలనీలవర్ణము, వీచిమేఘమాల, రత్నసక్షత్రావళికలిగి యాకాశంబువలెనున్నది.

కపిలు—ఆకాశము గుండ్రముగ నప్పడమువలె నున్నది. సముద్రమాకాశమంటివి—అప్పడమని బోసినోటంగొరికెదవుసుమీ.

రాము—గీ॥ చేరి పాతాళలోకంబుఁ జెప్పనలవి
గాక గంభీరజలముల గాధమయ్యె,
పరమపతివ్రతారతనంబు భర్తమీఁద
సరసగతిఁజూపు ప్రేమాతి శయమనంగ.

తమ్ముఁడా ! కులసతియగు నాసతి, భూసుత, జ్ఞప్తికి వచ్చుచున్నది.

గీ॥ కాలమరుగ వియోగదుః ఖంబుమాసి
పోవునందురా మాటలు బొంకులిపుడు
కానరాకున్న భూసుత కంటనిదుర
లేక శోకాబ్ధిమునిగినే లేవఁజాల.

కపిలు—దేవా ! చింతవలదు. వియోగదుఃఖము భరింపరానిదే. క్షమింపుఁడు. సదా బ్రహ్మచారియగు నీహనుమంతుఁడు, మిక్కిలి స్త్రీలోలుఁడగు నీసుగ్రీవుఁడు, కడువృద్ధగు నీజాంబవంతుఁడు, పసివాఁడగు నీయంగదకుమారుఁడు, వియోగదుఃఖమహాత్మ్యము నెరుంగఁజాలరు. అరితేరిన నేఁజెప్పెదవినుఁడు. మాయింటియిల్లాలు పుట్టింటికి వెళ్లియుండగా నేను వియోగంబు సహింపలేక కోతి, కొండముచ్చు, కుక్క, నక్క, కాకి, పిల్లి ముందిడికొనియు, కాయకూర, యాకుయలము, చెక్కచేమ, పరీక్షించి

యు, పంచాంగముకట్టచూచి మీనమేషములు, ఉబ్బ పూర్వా
షాఢలెంచి ముక్కునకుసూటిగా నెత్తిపైకి నభిజిల్లగ్న మెప్పు
డువచ్చునాయని ప్రొద్దుబుచ్చితిని. దేవరవారు నటులనే కాల
ము గడుపవలయు.

రాము—వయస్యా! నాశోకకారణము కేవలము నాప్రేయసి దూ
రముననున్నదనియుఁ, బరుండెత్తుకొనిపోయెననియు, యౌవనము
వ్యర్థమగుచున్నదనియు కాదు.

కపిలు—కాకమరేమి? కల్ల బొల్లిగసనగా?

రాము—

చ॥ బలిమిని మానవాంతకుఁడు ఒక్కఁగఁబోవగ దిక్కులేకనా
వలపులతావు, నాచిలుక వన్నెలమిన్న మనోహరాంగినన్
గలవరమంది నాథయని కంజదళేక్షణ పిల్చెనన్నయా
పలుకు విషాగ్నియై హృదయపల్లవమున్ దహనంబొనర్చెడిన్.

అనుజా! దేహత్యాగంబే కర్తవ్యంబని తోచుచున్నది.

ఉ॥ పీననితంబబింబ, ఘన పీనపయోధరి, మోహనాంగి చం
ద్రానన పక్వబింబ సదృశాధర చంపకనాసనాస్విసా
చానన జీవియున్న భువిఁ జావగనుంటకు హేతువొక్కటే
జ్ఞానవిహీనలయ్యు మనఁ జాలవు బాసినజంటచక్రముల్.

ఉ॥ ఎన్నడుచూడనౌనొ మది రేక్షణ నెన్నడుఁ గౌగలింతునో
ఎన్నడు మోవిచూరగొని యిందునిభాస్యకు విందుఁ జేతునో
ఎన్నడు రాక్షసాధముల నేపణగించి లతాంగిఁ దెత్తునో
ఎన్నడు బంధుబాపుదునొ యెన్నడు హక్కునఁజేర్చుమత్తునో.

కపిలు—శ్రీరామచంద్రా! స్త్రీనిమిత్తమింతిగాఁ జింతిపవలెనా?
స్త్రీ గాదెలోఁబోసిన ధాన్యము, దొడ్డిలోఁగట్టినయావు, పెట్టెలో
బెట్టినబట్ట, పురుషునిసొత్తు; ఒకటిగాకున్న మరొకటి. ఏకపత్నీ
వ్రతమా? ఉపన్యాసములోనిమాట, పైబూటకము.

రాము—నీవజ్ఞుఁడవుగాన నట్లనుచుంటివి. సర్వపిమయముల స్త్రీ పు

రుషునితో సమానమే. నాప్రాణవల్లభ, నాయర్ధాంగలక్ష్మి, నాసతీతిలకంబు సీతను మరువగలనా ?

గీ॥ జనకునంతటివానికి \ జననమంది
కోసలేశ్వరు గాదిలి \ కోడలవయి
యేకపత్నీవ్రతునకు నా \ కింతివయ్యు
రక్కసుని చెరనుంటివా \ రమణినీవు.

లక్ష్మణుఁడు—అగ్రజా ! విచారింపవలదు:

శా॥ తావుల్ దప్పరిపుల్ మహోన్నత ధను \ ష్టంకారమున్ జేయుచున్
బేర్వుల్ చించి సురారిసేనగదియన్ \ బీచంబడంగించి మా
యావుల్ రాక్షసయూధపాలకులతో \ యాదోపభున్ దెచ్చెదన్
నీవా దానవునేమిచేసినసరే \ నీ రేజప త్రేక్షణా.

కపి—పదితలల రక్కసుండననెంత. తోటకూరలోని చీడ. బలుసాకులోని పురుగు. గోటితో మీటినమాత్రమున చెమటకాయ విధంబున చిటుక్కున చితికిపోఁగలఁడు.

హను—

ఉ॥ కాల్చితి మొన్న లంక నటఁ \ గాలినదారదు పంపుమిప్పుడే
చీల్చి విరోధివర్గముల \ జీవముగోర్లెద వహ్ని చాచ్చుసన్
వ్రేల్చి సురారిసంపదలు \ వీర్యదవానల భీమకీలలన్
గూల్చెద మీపదంబుకడఁ \ గూర్చెదరావణుఁ దెచ్చి నింతలో.

కపి—చూచితిరన్నన్నఁ గాల్చివచ్చిన మహానుభావుఁడవు నీవంత వాఁడవే. సందేహమా ?

జాంబ—రాక్షసవనకుఠార ! తూర్పుకొండనుండి పశ్చిమాద్రికి దుముకుటచే నాకాలు విరిగినది. లేకున్న రావణుఁడెంత.

కపి—చింతచచ్చినను పులుపుచావకున్నది. తోళ్లుదిగజారి యల్లాడు బోసినోరుగల యీముసలియెలుగునకుఁ జావమొసు

అంగ—

శా॥ చంకన్ బెట్టి నశాశ్వన ప్రజలధుల్ | స్నానార్థియై ద్రిప్పినా
టంకంబింతయు లేక నా జనకుఁడా | ధాకన్ గనేయున్న వాఁ
డింకన్ బింకము లేలఁ బోవుదనుజాం | డెచ్చోట్లకుంబోవు ? ని
శ్శంకన్ దోకకుజుట్టి తెచ్చెదసుమీ | శాబాననన్ వానరుల్.

కపి—అవురా, పులిపిల్ల పులిపిల్లే, సింగముకడుపున మార్జాలము పుట్టునా ? నేనేల వెనుకఁదీయువలయు. దానవమహోదధి నవానలంబా ! శ్రీరామ ! దేవరవారు దానవవంశమును మామిడిపండువలె గుటుక్కున మ్రింగనున్నారు. నేను తాటిపండువలె పీచ్చి పిప్పిచేయనున్నాను. పండ్లమాటచెప్పిన నీవానరులు నోరూరునట్లు పల్లికిలించుచున్నారు. వీరినోట గడ్డకొట్టి యుండరరాకు సుఁ నేనే పొట్టఁబెట్టుకొనెదను. దేవా ! మీకు చింతింపనక్కరలేదు. మాడుము నాప్రతాపము. రామరావణయుద్ధము వచ్చునని యోధులు కత్తులునూరుచున్నట్లు నేను గాయిత్రి వేసివేసి ఘుటికపట్టించియున్నాను. అభిమంత్రించి లంకపై నొక్కసరు విసరితినా ప్రేగులు తెగి, గుండెలుపగిలి, ముక్కచెక్కలై రక్కసులుక్కిరిబిక్కిరియై పకఁ జచ్చెదరు. మాడుము నాదెబ్బ.

రాము—చెలికాఁడా ! నీవిశ్వాసమునకుఁ గడుసంతసించితిమి. బ్రాహ్మణులన నంతవారే !

సీ॥ చప్పుడు లేకుండ | జలరాశి నొకత్రుటిఁ
పానంబు జేసెను | బ్రాహ్మణుండు
జాహ్నవిఁ జెవినుండి | జారగావిడచెను
ప్రబలతేజోరాశి | బ్రాహ్మణుండు
సగరకుమారుల | సర్వంబు మసిజేసె
బలుయోగధుర్యుఁడు | బ్రాహ్మణుండు
కౌశికశరవహ్నిఁ | గదలక మ్రింగెను
పదపడి ఘోరాని | బ్రాహ్మణుండు

గీ॥ మాకు తాతయుఁదండ్రియు ♦ మాకురుండు
బలము, శౌర్యము శక్తియు ♦ బ్రాహ్మణుండు
బలములకు మూలబలమాను ♦ బ్రాహ్మణుండు
ధనము పావనకర దైవ ♦ తంబునాకు.

కపి—హా. హా. హా. ఏమేమి!
ఔరౌరా-అబ్బబ్బా!
ఓహోహో యేమిభక్తి!
సహ్వా. ఏమినీతి!

(పై సీసమునకు మధ్యమధ్య యాడవలెను)

దేవా! చల్లగవచ్చినను బ్రాహ్మ్యమున సామాన్యమా! సుగ్రీవాను లతిసులభముగా బ్రాహ్మణ్యంబు సంపాదింపనున్నారు. వీరియభిప్రాయమేమో? బ్రాహ్మ్యము వీరి మిండకత్తెల నొయ్యారము తాండవమాడుచుండె ననుకొనిరో? సురాభాండమునఁ దొణుకులాడుచుండె ననుకొనిరో? మాంసపుబుట్టల నిండియుండు ననుకొనిరో! విశ్వామిత్రాది మహామునులు తల్లక్రిందుగా తపంబొనరించి వెల్లకిలఁబడినఁగాని బ్రాహ్మణ్యము దొరకదయ్యె. వీరికా! యెక్కడిమాట.

సుగ్రీ—విశ్వామిత్రాదులకేమిలే! వారిసిద్ధులుగుండనిమ్ము. జన్మతోనె తెచ్చుకొంటివి బ్రాహ్మణత్వము. నీవే ఘనుండవు.

కపి—జన్మతెంచవలెనా? తాము! సూర్యపుత్రులు!

(విభీషణుఁడు ప్రాకారశయనము.)

(తెరలో) కలకలధ్వని-అందరాలకించుచున్నారు. కపిలుఁడు భయమున లక్ష్మణుని చాటుకుపోయి వణకును.)

విభీ—ఆర్తశరణ్యా! దీనపరాయణా! భక్తపోషణా! శరణాగతవత్సలా! కౌసల్యానందనా! సీతామనోనాయకా! మాంపాహి మాంపాహి.

(విభీషణుఁడు-పైనుండి)

గీ॥ మానభంగమునోర్వక ౹ మాన్యచరిత
దారపుత్రాదిధనములఁ ౹ దరికిఁద్రోసి
దిక్కునీవని వచ్చితిమో ౹ ధీరవర్య
శరణు, శరణయ్య! శరణార్థి ౹ శరణు శరణు.
దశరథనందనా ! శ్రీరామ ! రక్షింపుము రక్షింపుము.

రాము—

శా॥ రక్షింతున్ భయమేల రంకుమనుజుల్ ౹ రక్షోవిభుల్ దేవతల్
యక్షుల్ పన్నగసిద్ధసాధ్యబలముల్ ౹ యారాట్యటముల్ చేసినన్
గక్షల్ బూని యడెందఁడ్రిమిఖనఁ ౹ ఘుంబె ౹ కొన్న మా
మా క్షోభంబు నమాన్వి గాతుమిములన్ ౹ మీమానుఖముల్
బాయుడీ.

విభీ—ఆహా ! బ్రతికితిమి !

1టో మంత్రి—ఓహో ! ఏమి యౌదార్యము !

2డో-మంత్రి—ఆహా ! ఎట్టి దయార్ద్రహృదయము !

3డో-మంత్రి—ఔరౌరా ! ఏమి యకారణవాత్సల్యము !

4గో-మంత్రి—ఏమి కరుణారసము-!

5దో-మంత్రి—ఏమి-వింతకౌశల్యము !

కపి—అబ్బబ్బా! ఇదేమిగోల! వీరు పందుల ముండ్లవలె కొనలు దేరిన మిట్టపళ్ళు, చింతనిప్పులబోలు మిడిగుడ్లుగల్గి, కారుదున్నలో, జీమూతజాలమో, కొండకొదమలో, యన నీభీకరాకారములఁజూడ నాగుండెలవియుచున్నవి.

సుగ్రీ—నీగాయత్రిని గట్టిగపట్టుకొని విడువకుము.

కపి—నీమిండకేను, నీకల్లుముంతను, నీమాంసపుబుట్టను భద్రపరుచుకొనుము.

లక్ష్మ—వయస్యా ! భయపడకుము.

విభీ—గీ॥ దేవకాంతలఁ జెరబట్టి । తెచ్చెనెవఁడు
సాధుజనులను బాధించు । శఠుఁడెవండు
దొంగిలించెను మీనాతి । ధూర్తుఁడెవఁడు
యట్టిరావణకంటకుఁ । డన్ననాకు.

కపి—ఆహా హా! పాపము శమించుగాత? అయ్యో - మోసము! అబ్బో! రాకాసిమూకలు రాబాబో.

విభీ—
ఉ॥ పేరఁ విభీషణుండు రణ । భీమబలాఢ్యులకెన్న లంకమా
యామహిపాలసన్నిశమున । నశ్చిన మొందితి భూవరుండ యి
వ్వారలు నామమంత్రులు వి । వాదకుఁబోరు పరోపకారకుల్
ఘోరముజూడలేక నటఁ । గొల్వగవచ్చితిమయ్య మిమ్ములన్.

సుగ్రీ—అయ్యో మోసము! ఏమిచిత్రము—
ఉ॥ ఎవ్వఁడు దుష్టచారియయి । యెందరికన్యల మోసపుచ్చెనో
ఎవ్వఁడు మాతలోదరిని । నెత్తుకపోయెనో దొంగిలించి యా
కొల్పిన దానవాధమునిఁ । కూర్మిసహోదరుఁ డేగుదెంచెగా
నవ్వా విన్నవారు నుడి । నమ్మక మేవిధిఁబుట్టు భూవరా!

కపి—నిజము, నిజము- వీడు విషముకలిపిన కల్లుకుండ. తొణుకుట లేదు. నిండుకుండవలెనున్నాఁడు. సుగ్రీవున కీవిషయమున ననుభవము మెండు. బాగుగ పసిపట్టినాఁడు. పయోముఖవిషకుంభములవలెనున్న నీదానవుల నిప్పుడే వెడలఁగొట్టుము. నాకుండె లావలించుచున్నవి.

అంగ—గీ॥ ఉనికిజూచిన లంకలో । నుండువాఁడు
జన్మచేతను మనుజభో । జనుఁడువీడు
కాలముపరికింప శాత్రవ । కులమువాఁడు
నమ్మవచ్చునె శరణన్న । నమ్మకంబె.

కపి—వీరు గడ్డిక్రిందపాములు. నాకర్రదెబ్బకుఁ జచ్చువారుకారు. పసుపుపై దెబ్బలవలె నా వ్రేటులు వ్యర్థమగును. దేవా! వీరు

మన లోతుపాతులఁ దెలియఁగోరి నేంచేసినస్వాములు. వాడిగల తూపుల వీరిని లంకలోఁ బడవేయుము.

రాము—గీ॥ కనుముసుగ్రీవ పరికించి ఘనుఁడితండు
ఇట్టి యసమానతేజ మీ యింపుసొంపు
లిట్టినిర్మలగాంభీర్య మెచ్చటైన
మానసులకుండునా నాదు ముఖ్యసఖుఁడ !

విభీ—ఆహా ! సజ్జనుల మనోనిర్మలత !

జాంబ—దేవరవారు దేశకాలములు గుర్తెరిఁగినవారు. ఇతఁడకాలమందు మనలఁ జేరవచ్చె, నమ్మరాదు.

హను—సకలరాజనీతికోవిదా ! ఇతఁడకాలసంప్రాప్తుఁడా ? ఎట్లు?

ఉ॥ దేవరయందు దాస్యనియుక్తితరాజ్యమునందు గాంచి మీ
దేవిజయంబటంచు మది కెంగిలియొ నమ్మకముల్లవింపగాఁ
దావిని వాలిజంపుటయుఁ దమ్మునకిచ్చుట రాజ్యమంతె మీ
సేవకువచ్చినాఁడు తన సేమముగోరుచు రాజ్యకాంక్షచేన్.

లక్షణములు పరికింప చక్రవర్తిలక్షణము లొప్పుచున్నవి. అనాడా నీచరావణుండు బ్రహ్మాస్త్రముచేఁ గట్టుపడియున్న నన్ను జంప ప్రయత్నింప కోతినిజంపఁగూడదని ధర్మసూక్ష్మమెరింగించిన మహానుభావు డీతఁడు.

విభీ—దేవా ? ఆదుష్టదానవునితో నేనిట్లంటిని.

ఉ॥ రాముఁడు లోకపాలకుఁడు రావణ భూసుతలోకమాత నీ
కామవిచారసంగతుల గర్వము శీఘ్రమె మెల్చుమ్ము పోదమా
రామనృపాలశేఖరుని రాణిని నర్పణజేయ రాక్షస
క్షేమముగోరుమయ్య పరికింపవు రాఁగలచేటు సోదరా.

అని చిలుకకుఁ జెప్పినట్లు చెప్పితి. కాలచోదితుండై వినక యానీచదానవుండు నన్ను సకలదనుజసమక్షమున వినరానిదుర్భాషలాడి పరిభవించె. పరాభవంబు సహింపలేక దేవరచాటున జేరితిని.

ఈయార్తుల పోషింపవలయు. ఈదీనుల కాపాడవలయు. ఈశరణాగతుల రక్షింపవలయు.

సుగ్రీ — గీ॥ దగ్ధమొనరింపఁబడెఁగాదె తనదులంక
చంపఁబడె మొన్న సద్గుణ శాలితనయుఁ
డట్టి దురవస్థనున్నట్టి యన్న విడిచి
వచ్చినాఁడితఁడెవరిని వదలకుండు.

విభీ — వీరిదుర్భాషచే మేము నిరాకరింపఁబడుదుమేమొ ?

కపి — సుగ్రీవుఁడు పానకములో పుల్లవలె నడ్డపడుచున్నాఁడు.

రాము — ఇందొక విశేషము దెల్పెద. ప్రబలజ్ఞాతివైరంబుచే నితఁడు మనలఁజేరె. గాన నవశ్యమీతని రక్షింపవలయు.

సుగ్రీ — గీ॥ శాంతిబొందదు మదినాకు శత్రునిటకుఁ
జేర్చినంత నిష్ఫలమేమి ? చెప్పుము సుధీవ !
నిమ్మ మొగలంటఁజెడఁగొట్టి మీరిపోక
విడిచియూరకఁబోవునే వెర్రివాఁడె ?

రాము — (కోపముతో) ఓహో ! సుగ్రీవ ! ఏమంటివి ?

మహాస్రగ్ధర.

వినవేయొక్కండఁగానే విదళితఖరదుర్వీర్యదర్పంబు వేగన్
కనవే తోనుండినారే ఘనబలుఁడగు విఖ్యాతుఁడా వాలినేయన్
తనలో నేమున్న నే మీ దనుజుఁడితఁడు నన్ దాకివంచింపవాఁడే
యసిలోనంగుష్ఠమాత్రిం బసురసురసమూహాధిక్షేపంబులెల్లన్.

సుగ్రీ — దేవా ! తాటకగర్వమదాంధభాస్కరుండవనియు, ఖరదూషణ కబంధాదిదానవ వనకృశానుండవనియు, వాలి బలజలధిబడబానలుండవనియు, లోకప్రసిద్ధంబే. దేవయోనులు మిమ్మని నోర్వజాలనప్పుడు సామాన్య దానవులమాట చెప్పనలెనా ? మోసంబొనరించి యితఁడు హానిచేయునేమోనని యట్లంటి. క్షమింపుము.

కపి — పెల్లదిమ్మ పేలినటుల పేలి సుగ్రీవుండు చల్లబడినాఁడు.

రాము—రావణానుజా ! నీకభయంబిచ్చితిమి. రావణబలంబు యథార్థముగ నీనోట వినఁగోరెదము.

కపి—ఇదే సరియైనపరీక్ష. ప్రత్యుత్తరమేమిచ్చునో ?

విభీ—

సీ॥ వనజాసనాద్భుత వరబలావధ్యుండు
దేవయోధులకెల్ల దేవవైరి
రణరంగభీముండు రావణావరజుండు
కుంభకర్ణుండు బల్ క్రూరుఁడనికి
రణమునఁగనరాఁడు రావణాసూనుఁడు
జితవైరిబలుఁడింద్రఁ జిత్తునామకుఁడు
దనుజసేనాపతి దర్పోన్నతుండు ప్ర
హస్తుండు విశ్రుత యశుఁడుబలుఁడు
గీ॥ లోకపాలసమానులు లోకవిదితు
లగుమహోదరాది దశస హస్రకోటి
దనుజనాయకులున్నారు దనుజపురిని
మాంసభోజనమదగర్వ మత్తులగుచు.

రాము—మిత్రమా ! నాప్రతిజ్ఞవినుము.

ఉ॥ రావణకుంభకర్ణముఖ రాక్షసవీరులఁ బిల్కుమార్చి భూ
దేవిభరంబుమాన్పి నిను దైత్యవిభూతికిఁ జేతురాజుగాఁ
బోవనుసుమ్ము మాపురికిఁ బుత్రులమిత్రుల బంధుకోటితో
రావణుఁగూల్చకుండ సుగ రాజనకుమ్మగికంబుదీర్పకన్.

విభీ—దేవా ! నామనోనిశ్చయమాలింపుము.

గీ॥ ఉతిసుతులజంప లంకసాధింపమీకు
ప్రాణమున్నంతమట్టుకు పరమభక్తి
సాయమొనరింతు సమయమూను సారముగను
బంధువాత్సల్యమనుమాట బారఁదరిమి.

రాము—(విభీషణుని కౌగలించుకొని) సౌమిత్రి !

గీ॥ సింధుజలములుగొనిరమ్ము ౯ శీఘ్రమితని
లంకకభిషేక మొనరింతు ౯ లావుమీర

సుగ్రీ— దైత్యుఁడరుదెంచి జనకజఁ ౯ దెచ్చియిచ్చి
శరణుజొచ్చిన నేమానొ ౯ శపథమధిప.

రాము—సూర్యనందనా ?

గీ॥ ఇచ్చితినిలంకయితనికి ౯ నీక్షణంబె
దనుజుఁడేవచ్చి శరణన్నఁ ౯ దప్పకుండ
నిచ్చెదనయోధ్య సామ్రాజ్య ౯ మేలుమనుచు

సుగ్రీ— దేవ! నున్నింత్రు తెలియని ౯ దీనునన్ను.

కపి—సుగ్రీవమహారాజగారు దయచేసి కూర్చొనుఁడు.

(అభిషేకము)

రాము—ప్రియమిత్రమా! ఈసముద్రము దాటుట కేమి యుపాయము చెప్పెదవు ?

విభీ—సకలకార్యధురంధర! శ్రీరామచంద్రా!

గీ॥ విశ్వకర్మవరసుతుండు ౯ విదితబలుఁడు
నలుఁడుకలఁడు మీసేనల ౯ నడుమవానిఁ
గట్టఁబనుపుము సేతువు ౯ గట్టునతఁడు
వరమహిమచేత నవలీల ౯ నన్నుమీర.

రాము—అట్లైన మనమిప్పుడేజని వానిని ప్రార్థింతమురండు.

(అందరు నిష్క్రమింతురు.)

రంగముపూర్తి.

ప్రథమాంకము—రెండవరంగము.

స ము ద్ర ము మీ ద వం తె న.

(హనుమంతుఁడు నలుఁడు ప్రవేశము.)

హను—శిల్పిశాస్త్రప్రవీణ, నిర్మాణతత్పరధురీణ, నల!

ఉ॥ కేకయరాజపుత్రి మును కిన్కను నాటిన మాధ్యబీజమే
కాకలుదేరి శూర్పణఖ కామసమృద్ధిని మొల్చి సీతనా
డాకులపాటునన్ మరది నాడినమాటకు నుబ్బి వృక్షమై
లంక వినాశనంబను ఫలంబిపుడివ్వగ సిద్ధమయ్యెడిన్.

నలు—అంజనిసుత ! స్త్రీలమూర్ఖత్వము సర్వవిషయముల శ్రేయోదాయకంబుగాకున్నను శ్రీరామకార్యమునకుఁ దోడ్పడుచున్నది.

గీ॥ దశరథసుతుండు సరిలేని ధార్మికుండు
కపటమెరుగని కళ్యాణ కరుణఘనుఁడు.
లోకమెల్ల నువినికి లొంగకున్న
మంచితానైన సకలంబు మంచికాదె.

కపి—(శీఘ్రముగా ప్రవేశించి)
అబ్బబ్బా ! ఎర్రగా కాలిన కొలిమిలోని చిట్టెపురాయివంటి మొర్రనిముట్టెంబుకలిగి జోడుగుండ్లబాణగల పెద్దఫిరంగిగొట్టములవంటి ముక్కురంధ్రములుగల యీకోతిముండకొడుకులతోఁ జావుసిద్ధమగుచున్నది. పేడిమూతులుగల యీపందకోతిరండకొడుకులకీ బలమెక్కడిదో ! అక్కడక్కడ నాకలములు కాయకసరు లేరుకొనితిని యీకొమ్మయీకొమ్మ పట్టుకొని వేళ్లాడు నిరాధారులకీ ధైర్యమెక్కడినుంచి వచ్చెనో. రేయనక, పగలనక, పెద్దనక, పిన్ననక, కొరుబట్టి యికిలింతలు, సకిలింతలు, గిలిగింతలు పెట్టి హద్దులేక పొద్దుతెలియక, సుద్దులెన్నో ప్రేలుచుందురు. శ్రీరాముఁడు మెత్తనివాఁడగుటచే మితిమీరి యీ మోటుపసరంబులు నెత్తిపై నెక్కుచున్నారు. ఏపుణ్య మేపాపమెఱుఁగక, నేజోక్యమునకుబోక, నెప్పుడెప్పుడు పురంబుజేరుదునా యని నొకమూల నొదిగియొదిగి యణగిమణగియున్న నేనే యీ తుంటరులకు హాస్యమునకుఁ దొరికితినట. ఈ ముద్దుముద్దుల సుద్దుల కౌసల్యాముద్దులపట్టియొద్ద మొఱఁబెట్టి వీరిభరతంబుపట్టిం

చెద—(హనుమంతునిజూచి) రామభూపాలుఁడెంగున్నవాఁడు? కోతిమూకలదొర యెచ్చటనున్నాఁడు?

నలు—కపిలాచార్య! శ్రీరామచంద్రుండెందున్నాఁడో యరయఁ జాలని సోమరివైతివా? రాఘవునితో నీకేమిపని.

కపి—అర్చేదవా? తీర్చెదవా? రామభద్రుజాడ దెల్పుము. లేకున్నఁ బోయెదను.

నలు—రామవిభునితోఁ జెప్పుటకు చాడీయేమి సిద్ధముజేసితివి?

కపి—ఔరా పిఱుగా! నీకెన్నియ్యూహాలున్నవిరా? లేకున్న నాలుగురోజులలో సేతువఁ గట్టవేచ్చితివా?

నలు—చాడీ యేమిచెప్పఁదలచితివి? చెప్పు-చెప్పు.

కపి—ఈవానరశుంఠ లిటులనే ప్రాణములుదీసి, యెముకలుకొరికి, యల్లించిబెల్లించి లోతుపాతులు తెలుసుకొని మోసముచేతురు. ప్రకాశముగా, ఆత్మబంధువు డౌఁకితివని నీతోనే చెప్పకొనవలెను.

నలు—చెప్పకపో—చూతము.

కపి—ఈసముద్రము వీరినంటఁజిమ్రింగినగాని నాకీకపులబాధ నివృత్తికానేరదు.

నలు—నీకీబాధతీరు మార్గము చెప్పెదవినుము. నెమ్మదిగా శ్రమపడి యీవాయుపుత్రు నాశ్రయించి వానివాలమును పట్టుకొని వ్రేలాడుచుంటివా యేలంకకాల్చునప్పుడో యేసముద్రములో ముంచునప్పుడో, యేకొండకుచుట్టి పెకలించునప్పుడో విముక్తి సిద్ధించకమానదు.

కపి—ఓరీ! తులువా! నాచావు కోరుచుంటివా? చీ నీనోరుమూయుము. నాతల్లికడుపు చల్లనిదైతే నీనోటిచేటునకేమిలే?

హను—మీరాచకార్యముల కట్టిపెట్టుడు. కౌసల్యానందనుండు వచ్చుచున్నాఁడు.

(రామాదులు ప్రవేశించుచున్నారు.)

కపి—శ్రీరామచంద్రా! నీవు సత్యవ్రతుండవనియు, నాశ్రితపక్షపాతివనియు, శరణాగతవత్సలుండవనియు మోసపోయి యున్నాళ్లెటులనో నీకొలువుజేసితిని. ఇక నొకనిముషమైన నీయొద్దనుండనోప. సీతామహాదేవి నిన్నెప్పుడువిడిచెనో యప్పుడే దయదాక్షిణ్యములు విడిచిపోయినవి. ఇదే పోవుచున్నాడను. (మరలివచ్చి) నీవసాధ్యుడవు నమ్మకూడనివారు నీబంట్లు. నన్ను వెళ్లఁజూచి నాపై లేనిపోని దొంగతనములాపాదించి కట్టి తెప్పింపఁజూతురు. ఇప్పుడేనన్ను బరీక్షించి నాకు శెలవొసంగుము.

రాము—అనుజా! కపిలాచార్యుండేల యిట్లనుచున్నాఁడు? మనసైనికులెవ్వరైన నితని పరిభవించిరా?

కపి—కూటికిఁ జేరినఁ బక్కబ్రాహ్మణుఁడుకదాయని నన్ను వేధించుచున్నారు.

లక్ష్మ—ఎవరు?

కపి—ఎవరున్నారు. మనసైత్రిపెదేవతలు. కిష్కింధాపురపగ్రహారీకులు.

లక్ష్మ—ఏమిపరాభవ మొనరించిరి?

కపి—ప్రాణమే తీయఁదలచిరి. సముద్రములోఁబడవైచిరి.

లక్ష్మ—ఎప్పుడు?

కపి—ఇప్పుడే!

లక్ష్మ—ఏల?

కపి—సీతాదేవి సందర్శననిరీక్షితుండనగు నేను సేతుబంధనము సమాప్తంబయ్యెనని విని నలునియనుమతిని యీనూరుయోజనములకటడ మొకత్రుటిలోఁ దిరిగిచూచుటచే కమడస్సి రాత్రిని దురించితిని. నేటిసూర్యోదయంబున బడలికచే మెలుకవ రాదయ్యె. మంచముపైఁ బరుండిననన్ను మీవానరకిరాతులెవరో మంచముతో నెత్తుకొనిపోయి సముద్రమువంచను బెట్టిరి.

లక్ష్మ—సముద్రఘోషమైన మెలుకవరాలేదుగా ! పాపము! కను డస్సితివి.

కపి—సూర్యోదయంబునఁ బోటుపొడిచి కెరటంబులు పెద్దవాయెను. అంత నొక పెద్ద తరంగము నన్నుడ్డికొట్టగా నదరిపడి లేచునప్పటికి మఱియొకతరంగము పడఁద్రోసినది. మఱియొకటి గట్టునకులాగినది. ఇంకొకటి లోనికియీడ్చినది. ఇట్లు లోనికిబైటకు కరరివలె బిర్రిబీసుకొని కొట్టుకొనిపోవుటచూచి కపులు నవ్వుచు కేళింతలుకొట్టిరి కాని బైటకుఁదీయరైరి. ఎటులనో యీ సముద్రనిక్కపవల్లబయటపడి మీనద్దకుఁ బరుగునవచ్చితిని. ఇక నిటనుండిన నాకు ప్రాణహాని, మానహాని. సేవాసంగము.. ఇదే పోవుచున్నాడ.

సుగ్రీ—మేలు మేలు ! శాపడవై యుండి సూర్యోదయమైనను స్నానసంధ్యలులేక నిద్రించుచుంటివిగాన మావారు నీకు సూర్యోదయస్నానము లభింపఁజేసిరి.

లక్ష్మ—సేతుస్నానఫలంబు నీకందఱికన్న ముందు లభించినది. నీవు ధన్యుడవు.

కపి—బ్రతికివచ్చితిగాని లేకున్న నేను నాపితరులు ధన్యులయ్యే యుందురు.

రాము—కపిలాచార్య ! ఊరడిల్లుము. నిన్నట్లు పరిభవించిన వానరుల గుఱించి చూపఁగలవా ?

కపి—వారధిదాటునప్పుడు నాకెదుట నందరినడపించితిరా గుఱించెదను.

రాము—అటులనె జరిపెదను. నిలువుము—

గీ॥ సీతకోఁదురాల యో ఁ నిర్మలాంగి
సీత సాధుగుణోపేత ఁ శింశుమార
పాదపఛ్ఛాయ నెట్లుంటి ఁ భయములేక
రక్కసులునిన్ను బెదరింపఁ ఁ బెక్కుభంగి.

లక్ష్మ—సహోదర! చింతమానుడు. మైథిలీసమాగంబు సమీపములోనే యున్నది. అందునకు నిదర్శనంబు సేతువు నాలుగు రోజులలో సంపూర్తియగుటే! అల్లదిగో నలానిలసుతులు తమకై నిరీక్షించుచున్నారు.

హను—
నలు— జయము, జయము, కౌసల్యానందన!

రాము—శిల్పివర! నల!

గీ॥ శిల్పులకు విశ్వకర్మయే ♦ శిరముపూవె
నయ్యెఁ బువానికి సరియంద్రు ♦ మహిమయందు
మించినాడవు వారల ♦ మిత్రవర్య
బాలుడవెనీవుగన విశ్వ ♦ బ్రాహ్మణుండ.

కపి—ఔరౌర! భూసురోత్తముండ నేనుండ శాపోపహతవంశస్థుండగునితని విశ్వబ్రాహ్మణుండని, విప్రుండను, పరమమిత్రుండను, చిరకాలాశ్రితుండనగు నన్ను వంచించనగునా? స్నేహముచేతనో మక్కువచేతనో యితనికి యాధిక్యతకల్పించితిరి. నేనొప్పుకొందునా? సేతువదాటినతోడనే జరుగు జనాభాగణితిలోమట్టుకు వీనికి బ్రాహ్మణశబ్దంబు వర్తింపనీ, రాద్ధాంతసిద్ధాంతములు జరిపి, జంధ్యములు తెగింపుకొని, నాలుకపెకలించుకొని మరణించి మీకు బ్రహ్మహత్యాదోషంబు కలుగఁజేసెదను. చూడుడు నాతాత్రి.

రాము—చెలికాఁడా! కులగోత్రములమాట లటుండనిమ్ము.

గీ॥ నీటిలోఁ గట్టుకట్టిన ♦ నేతయితఁడు
నాల్గుదినముల జలనిధి ♦ పదుమనూరు
యోజనంబులుగట్టె నో ♦ హోమునంగ
బ్రాహ్మణుండ! నీకట్టమనో ♦ బలముకలదె.

కపి—ఇందుకా! లేకేమి?

లక్ష్మ—ఎక్కడ? ఏంమునిమిత్తము?

కపి—విస్తరివద్ద పాయసము జరిగిపోకుండ నన్నుపుకట్టుకట్టడములో.

లక్ష్మ—రామభూపాల ! కంటిరా ? కడలిపై కట్టిన రాతిగట్టు.

రాము—తమ్ముఁడా ! ఈకట్టడమునకు వడివంపు కనుపించదుకదా.

ఉ॥ తుంటరిదానవాధముఁడు ఽ తోయజనేత్రి దయావిహీనతన్
మింటనుగొంచుపోన్ బలిమి ఽ మేలగు మౌక్తికహారరాజముల్
జంటలువీడి నీటిపయి ఽ జారినవోయన జూడఁజూడనా
కంటికి మేదినీసుతమొ ఽ కన్పడు చందము దోఁచెమిన్నగా.

హను—రామభూపాల !

గీ॥ కొండలకు కొండలేదాపి ఽ కూర్చినాఁడు
జలధిపైపైని నేర్పునఁ ఽ జావరాలఁ
దేలఁబెట్టి పట్టువిడక ఽ దీటుచెడక
గీటుగీచినచందాన ఽ గిరులనిలిపె.

రాము—ఇదే భూసుత- నిజముగా భూమిసుత- నాకెదురురువచ్చు చున్నది.

గీ॥ అల్లదుగో సీత జలకంబు ఽ లాడి కురుల
వేళ్లతో విడఁదీయుచు ఽ వెందు సేయుఁ
గాంతకచభారకలిమమున్ ఽ గాచలేదె
తీర్చిదిద్దినపాపిట ఽ తీరుగాదె.

విభీ—కాదు కాదు.

గీ॥ దంబుమీరిన యలలతాం ఽ డవముగాని
యార్చుకొనెడుకురుల సమూ ఽ హంబుకాదు
కట్టితీర్చినవారధి ఽ గట్టుగాని
భూమిసుతచేయు పాపిట ఽ బొట్టుకాదు.

కపి—సంశయము లేదు. ఇది యచ్చమైనయాడది. స్త్రీలజంపి పుట్టినది. అందెలు కడియములులేని దిశికాళ్లవంటి యీస్థంభములు, నబ్బుతో తోమివిడచిన, బొట్టులేని విశాలఫాలములవంటి చదునైన తెల్లరాల ఫలకంబులు, జడగంటలులేక వేయబడిన

జడపలె కొనతేలి వడివంపులేని యీవంతెన నవీనులనాగరికంబును ప్రకటించుచున్నది. ఈకృతయుగంబున రాబోవు కలినాగరికతను సూచింపఁజేసిన నలుని దివ్యదృష్టిప్రభావమేమనవచ్చు.

సుగ్రీ—నలుని దివ్యదృష్టికేమిగాని, బ్రాహ్మణోత్తముండవగు నీ దృష్టిమహిమయే.

కపి—నీకు బ్రహ్మద్వేషము పుట్టినది. బ్రహ్మద్వేషులు బ్రతుకరు సుమీ! మొన్నటివరకు ఋష్యమూకమున దాగినట్లుండలేదు కాబోలు. రామచంద్రునిజేరి బొల్లిమాటలు చెప్పి కల్లయేమవు లేడిచి, లేనిపోని పెడగర్భములుబలికి భార్యావియోగముచే మతిలేకయున్న రామభూమీశుని బురిగొల్పి శూరాగ్రేసరుం డగ్రజన్ముండగు వాలిని దుర్మరణంబొందఁజేసితివి. ఇప్పుడుకదా తలనెత్తనేర్చితివి. మొన్నటివరకెక్కడుంటివి?

సుగ్రీ—రాముని వేడుకచెలికాడ నగుటచేఁ గ్రిందుమీదెరుగకున్నావు.

రాము—గీ॥ రాక్షసులమధ్య రమణినా ॥ రాజనందన
సీతదుఃఖాబ్ధియున్నది ॥ సేతువిపుడె
దాటసెలవిమ్ము మిత్రుఁడా! ॥ ధన్యచరిత!
నీరజాక్షి నిఁజూడక ॥ నిలువఁగలనె.

నలు—మహాప్రసాదము. దేవరవారి యనుగ్రహమునకై యెదురు చూచుచున్నాడ.

రాము—ఈవంతెన మొదట నేనెక్కెదను. సమస్తసేనాసహితంబుగ సుగ్రీవుండు నన్వెంబడించుగాత.

కపి—వలదు-వలదు. (రామునియడ్డగించి) నేనపశకునపక్షిని. నీసైనికులు పరమశుంఠలు. బ్రహ్మచారికొయ్యలు. నీసేనాధిపుఁడు సుగ్రీవుఁడు బహుస్త్రీలోలుఁడు. బల్ త్రాగుబోతు. వావివరుస లులేనివాఁడు, నీపాదములకు రాళ్లనుస్త్రీలనుచేయు మహాత్మ్యము కలదు. బహుశ్రమపడి యీసేతువుబండలతో నలుఁడు కట్టి

నాఁడు. నీపాదము సోకినవెనుక గౌతమాశ్రమమునఁబడియున్న రాయి స్త్రీయైనచందమున యీకట్టడమునందున్న బండలన్ని యు నాడవాండ్రు కాగలరు. నీసేనలా యాడవాండ్రవెంటఁ బడి పలుకకుందురు. యుద్ధమాగును. సీతామహాదేవి లంకలో కృశించును. కాన శ్రీరాముఁడీ సేతువనారోహించకుండుగాక.

రాము—కపిలాచార్యునివాక్యము గౌరవించితిమి. లక్ష్మణుఁడు ప్రథమమున దీని నారోహించుగాక.

కపి—వద్దు-వద్దు (లక్ష్మణుని యడ్డగించి) నేను మోటుబంటును. చిరకాలాశ్రితుండను. మీమేలు కోరువాఁడను, ఈలక్ష్మణుఁ డింద్రజిత్తును సంహరింప కృతనిశ్చయుఁడై యున్నాఁడు. ఇంద్రుని పేరుచెప్పిన పర్వతములు సముద్రములో దాఁగుచున్నవి. ఇంద్రుని జయించిన యింద్రజిత్తును సంహరింపనున్న యీలక్ష్మణుఁడు పులిమీదపుట్రి. వీనిపాదములు సోకినంతనె బండలతోఁ గట్టబడిన యీవంతెన సముద్రములో మునిగి దాఁగఁగలదు. సముద్రముదాటుట కడుదుర్లభము. లంకఁజేరుట యసంభవము.

సుగ్రీ—సకలశాస్త్ర పారంగతుఁడవు. భూసురశ్రేష్ఠుఁడవు. నీవే ప్రథమమున నీకట్టునెక్కి చూడుము.

కపి—నీకీద్వేషమున్నదని యెరుగనా? విప్రకషాయము పుచ్చుకో నంటివా? బ్రాహ్మణబలియిచ్చినగాని నీప్రయత్నము కొనసాగదా? శ్రీరామచంద్రా! చూచితివా? ఈసుగ్రీవుని ద్రోహచింత. సున్నగాఁజెక్కబడి పాలగచ్చుతో సరిపోలిన యీబండలపై నాకాలుమోపినంతనే బలహీనముతోనున్న నేకాలుజారి వెల్లికిలఁబడుదును. ముండనముచేయించుకొన్న నాతల యీబండలపై సహస్రముక్కలుఁ గాఁగలదు. నన్నీనూతనకట్టడమునకు బలియిచ్చిపోవలెనని యున్నాఁడు.

రాము—కపిలాచార్యుని సన్మతమేకదా వినవలయు.

కపి—జనకాత్మజా వియోగదుఃఖముచే కడుబలహీనతగల మీకు పదునాలుగువత్సరములు నిద్రాహారములులేని మీసోదరుఁడు

నూరుయోజనములు నడువజాలరు. కాన వాయునందనుని వీపుపై దేవరవారును, వాలినందనుని మూపుపై లక్ష్మణుఁడు నెక్కవలయు. అడవులలోనాకలములుతిని తిండితిప్పలులేక జాడ్యగ్రస్తుండనగు నేను. సుగ్రీవుని నారోహించి సవారిచేసెదను.

సుగ్రీ—నోరుమూయుము.

రాము—మిత్రమా ! నల !

గీ॥ కొండలకుకొండలేరీతిఁ గూర్చినావొ ?
నీటిపై బండలేరీతి నిల్పినావొ ?
లాఘవము నీదికనుమిన్న లావుబుద్ధి
శిల్పిశాస్త్రధురీణ వౌ చిన్నియన్న.

నలు—దానవాంతక యోశ్రీరామ ! ఇందు నాప్రజ్ఞావిశేష మేమియు లేదు. ప్రస్తుతింపదగినవారు కపులు-యేమన—

సీ॥ చేతుల మూపుల శిరములనిడికొని
కొండలేదెచ్చిరి కొంతమంది
నెత్తిపై గిరులను నిల్పి భూధరములఁ
గూలఁదన్నిరి నేలఁ గొంతమంది
ఘనపర్వతంబులఁ గంతుకంబులరీతి
గురిచూచివిసరిరి కొంతమంది
కాళ్లకువేళ్లకు కంఠంబులకుగట్టి
కొని గట్లనడచిరి కొంతమంది

గీ॥ గుబగుబాలను నీటిలో గొప్పనద్దు
విధివిరామంబులేక నే వెలసె ! చదల
కరచరణశిరవాల సంఘాతములకు
వినుకులేదయ్యె ! శ్రీరామ ! వింతయేమొ.

కపి—స్వామిభక్తి కించుకలోపంబులేదు. ఉత్సాహముతోనున్నవానరులఁజూచి ప్రేరేపితుండనై గుఁడ్రనినల్లకొండ నొకదానిగాంచి చేతులనూపి చూచితిని. నాశరీరమూగెను గాని కొండకదలద

య్యె. అంత నంగదకుమారునిజూచి దీనినెత్తి నానెత్తిపైఁ బెట్టుమంటి. ఇతఁడైన మర్మమువిప్పి చెప్పక కొండను నానెత్తిపై బెట్టినాడు. భారంబు సహింపలేక వడలెల్లవణకసాగెను. కన్నులు తిరుగఁజొచ్చెను. నెత్తిపెంకు వేడెక్కి మండసాగెను. పాదంబులు నేలపై నిలువకపోయెను. శరీరమంతయు ముచ్చెమటలుపట్టి తడఁబడసాగెను. స్వామికార్యమునకు లోపమువచ్చునేమోయని ప్రాణములు బిగబట్టుకొని యోర్చుకొని తప్పటడుగులు వేయుచు వచ్చుచుంటిని. కపులునవ్వసాగిరి. కొందరు చప్పట్లుకొట్టిరి. కొందరు వెక్కిరించిరి. కొందరు కేకలువేసిరి, కొందరు పరిహాసపూర్వకముగ స్తోత్రముచేసిరి. కొందరు నాగమనవికారము నవ్వుపుట్టించులాగున వర్ణించి గంతులువేసిరి. శ్రీరామచంద్రమహాప్రభూ! అప్పటి నాదురవస్థ చెప్పుకొనుటకు నాకే సిగ్గగుచున్నది. కపులపండుగపండినది. నాచుట్టు చప్పట్లు, కేకలే, నవ్వులే, తుళ్లులే, మరింతకొల్లుసాగినది. ప్రాణములు బిగబట్టుకొని సముద్రము సమీపించి కొండనలునకందివ్వఁ బక్కనపగిలి రెండు పెళ్లలై నీటిలో పడిపోయినది. అప్పుడు నాదురవస్థనేమిచెప్పుదు. నేతెచ్చినది కొండకాదట. పులిగడ్డ నల్లముట్టిసుద్దట. ఈయంగదకుమారుఁడు వీని పినతండ్రినిమించినవాఁడు.

సుగ్రీ—నీకుతోడు కొండమోయుటకూడనా ?

విభీ—నునుపగుపాలగచ్చు నధిక్షేపించి స్వచ్ఛమగు సజ్జనహృదయములఁ ధిక్కరించి, నిర్మలమగు నిలువుటద్దముల సరకుగొనక, నిగనిగలాడు స్ఫటికహారమో, మెరుగులీనుమణిమాలయో, యచ్చరాంగనలు తమలావణ్యము చూచుకొనుటకు నిర్మించిన దర్పణపంక్తియోయన నొప్పుచున్నదీవంతెన.

లక్ష్మ—కులగురుండు, శతమయూఖుండుదయాద్రివిడిచి పైకెక్కుచున్నాఁడు.

గీ॥ పాలబండలపరువులోఁ బ్రతిఫలించి
పద్మబాంధవుఁడలరెఁడు ప్రభలమించి

దేవదేవుండు నిత్యుండు దివ్యతముఁడు
నిర్మలాంతఃకరణముల నిండుభాతి.

కపి—సుగ్రీవుఁడు తనసేనలకు గట్టియుత్తరవుచేయకుండెనా ప్రమాదము వాటిల్లును. ఈవానరులు సంతోషముతో వీరావేశమున మోరలు పైకెత్తుకొని యవయవములు బిగబట్టుకొని యీవంతెనపై నడచునప్పుడు, తమ ప్రతిబింబములఁజూచి శత్రుసమూహమెదుర్కొనెనని కెవ్వున కేకవేసి పైకెగసి రా యల్లకల్లోలము సంభవించును.

సుగ్రీ—ముదిమిచేపండి, ముడతలచే నిండినపండుకోతి ననుకరించు నీ ప్రతిబింబమునుజూచి పిశాచమని భయపడి చిందులు త్రొక్కుకుంటివా యదియేమాకు మహోపకారము.

కపి—అది మీసాంగత్యదోషఫలమే. ఆరునెలలు సహవాసముచేసిన వారు వీరగుదురన్నది నిక్కువంబాయే. శ్రీరామచంద్రా! ఈకోతిమూకలకుఁ గిష్కింధకుఁ బోవసెలవిమ్ము. వీరిసాంగత్యమువలననాకుఁ గోతిరూపమువచ్చినదట. నీదివ్యమంగళరూపమునకు మార్పువచ్చెనా యా సీతామహాదేవి మిమ్ముఁజూచి నవ్వక మానదు.

నలు—గీ॥ తిమిరసముదాయమెల్లను దేఁపోవ
నుదయగిరిమీఁద కులగురుం డొనరియుండె
దారికెదురయి జయలక్ష్మి తానెచేత
గొప్పకై పేల్చిన ఫిరంగి గుండనంగ.

కపి—వేకువఁబయలుదేరు సాతానిస్వాములనెత్తిపై యక్షయపాత్రయో, పెద్దముత్తయిదువ నొసటిపైదిద్దిన కుంకుమబొట్టోయన నీసూర్యమండలంబు వెడలుచున్నది.

రాము—సుగ్రీవ!

గీ॥ చిత్రవిధమునఁ జీకటి చిక్కుదీర్చి
నిబిడరతిపారవశ్యత నిద్రఁజెందు

నీరజాప్తులమేల్కొల్పి ‡ నింగిజేరి
వెలుగువేవెలుగఁజూచు ‡ విపులగతిని.

కంటివా మనకులబాంధవుఁడు, భగవానుఁడు మింటదోచుచు న్నాఁడు; నీవు సూర్యపుత్రుఁడవు, మేము సూర్యవంశజులము. మనము సమీపబంధువులము. అందఱమేకమై వందన మాచరింతమా ?

కపి—ఇది సరిపడనిమాని. స్వభావవిరుద్ధమగువరుస. కుక్కనక్కలతోను, కోతికొండముచ్చులతోను, వివేకముగల మానవులకు సంబంధమెట్లు.

లక్ష్మి—గీ॥ మొదట జీవపదార్థము ‡ మొలకలెత్తి
లోహములఁజొచ్చి వృక్షంబు ‡ లోనఁజేరి
పిదప మృగజాతిగామారి ‡ పెరిగి మనుజుఁ
డయ్యెనెఱుగవా సృష్టిర ‡ హస్యమిదియె.

కపి—సృష్టిక్రమమిట్టిదా ? అట్లైన సూర్యకులముపెద్దా, సుగ్రీవకులముపెద్దా ? రవికులముకన్న వానరకులమే గొప్ప.

సుగ్రీ—చిన్నపెద్దతనములు వావివరుసలు పరీక్షించుచుంటివి. మాతో వియ్యమందెదవాయేమి ?

కపి—వియ్యమొందుటకు వీలెక్కడ ? మనవకున తాతామనుమల వరుసే !

లక్ష్మి—సూర్యభగవానునకు నమస్కరించి వారధి దాటుదము. (చేతులుజోడించి)

గీ॥ రవికులతిలకుఁడిదె రణ ‡ రంగమందు
చెలగివిహరింపనున్నాఁడు ‡ చెప్పఁజాల
మెంతె జననాశనంబౌనొ ‡ చేటుదెలిపి
తాత, శరణార్థినునుపించు ‡ దనుజుచేత.

రాము—మహానుభావ, కులదైవమ!

గీ॥ కాలగతిచేత ఘనలయ  కాలమమర
దశరథేశ్వరుఁడేగెను  ధరనువిడిచి
తండ్రిలేనట్టిపిల్లల  దనుపమాకు
దండ్రియును మరితాతయుఁ  దరణినీవె.

(అందఱు నిష్క్రమింతురు.)

మొదటియంకముపూర్తి.






ద్వితీయాంకము — మొదటిరంగము.

లంకలో వీధి.

విద్యుజ్జిహ్వుఁడు, మహిషముఖుఁడు ప్రవేశము.

మహి — తోళ్లు దిగఁజారినవి. తల పండినది. కన్నులు కనుపించుట లేదు. దంతములుతప్ప పళ్లన్నియూడినవి. ముసలితనము నన్ను మినపసున్నిముద్దవలె మ్రింగుచున్నను, కామపిశాచి విడువకున్నది. శూర్పణఖా! ఎంతచేస్తివే. మగఁడుచచ్చినముండకు నీకీ నిక్కులేల? నీపేరుతలచిన నాగుండె పగిలిపోవుచున్నది. మనసు కుళ్లిపోవుచున్నది. బుద్ధి బుగ్గియగుచున్నది. నడచినను, కూర్చున్నను, పండుకొనినను, నిలుచున్నను, మాటలాడుచున్నను, నిదురఁబోవుచున్నను నీవే ప్రత్యక్షమగుచుంటివి. అదుగో యెవరిక్కడ (అలకించి) శూర్పణఖా! వచ్చుచుంటివా (భయపడును) ఇదుగో! యెవరువారు, శూర్పణఖా! రాకు-రాకు. (యేడ్చును) నన్ను బ్రతుకనిమ్ము. మహాంకాళీ! నాజోలికి రాకుము. నీకు పదివేలదణ్ణములుపెట్టెదను. అయ్యో చస్తిని, చస్తిని. (అని యేడ్చును.)

విద్యు — (ప్రవేశించి) మహిషముఖా! ఆడువానివలె నేల యేడ్చెదవు?

మహి — నాయనా వచ్చితివా? నీవు కనుపించక దపించుచుంటిని. బాబు! శూర్పణఖచేతిలో నాకుఁ జావుతప్పదు. చీవాట్లతోఁ దలవాచినది. పిడికిటిపోటతో వళువాచినది.

విద్యు—వళ్లు వాచినపను లేమైనఁ జేసితివా యేమి?

మహీ—లేదురా బాబు! ఆముండ నామీఁద నెక్కి తొక్కి పిండిచేసినదిరా నాయనా!

విద్యు—ఊరికే నీవు కూర్చుండిన పనికిఁగాను నీపైఁ బడినదా?

మహీ—కాదు-కాదు. చెప్పెద వినుమరి- రామహతకుఁడు వానరసేనలతో సముద్రము దాటి సువేలాద్రిఁ జుట్టి దండువిడిసి యున్నాఁడని విని చూడఁబోతిని. వీరావేశముతో నున్న వారిం జూచిన నాగుండె ఝల్లుమనెను. ఈరూపముతో లోనఁ బ్రవేశించిన హానికరమని నేనొక కోతినైతిని.

విద్యు—ఆహా! చెప్పనేల! ఆ కోతికట్టాకారముకూడ వచ్చినది. చేష్టలెట్లుండెనో?

మహీ—కోతిచేర్యలు చేయుచు సేనామధ్యమునఁ దిరిగితిని. రాముని సమీపమునఁ గోతిరూపముతోఁ దిరుగుచున్న మన శూర్పణఖనుగాంచితి.

విద్యు—ముక్కుచెవులూడినను శూర్పణఖకాకి రామునిపై మోహము పోకుండెనా యేమి?

మహీ—ఈముక్కిడితొత్తు యూఁబోగ్గులలో రాముచెలికొ పక్కఁ జేరి పడఁగాపులుపడియుండ నేను సమీపించి నాయనా చెపలతచే-(శూ) అంటిని. అంతలో లేడియెగిరినట్లు చెంగున నెగిరి నా కంఠము గట్టిగా నొక్కి నోరుమూసినది. తండ్రీ-బుద్ధి చెపలత-చెంపలు వేసుకున్నాను. అది చెయ్యి మీఁద వేయుగాని నావళ్లు గఁబాడించినది. ఆడదానిచేతిలో నేనున్నదోగాని పసునెనిమిదేళ్ల వానివలె పనులుచేయ మొదలుపెట్టితిని.

విద్యు—నీయాకారమునకు, నీయౌవనపదశకు, నాఁడు దానిపై యాశయుండవలసినదే. గొంతుకపిసికినను సంతోషమే. (నవ్వుచున్నాఁడు).

మహి—ఓరీ! నీగొంతుగోసి క్రిందపడ వేసినను కళ్లుమిటకరించుచునే యుండును. మనవాఁడవుకదాయని యిష్టాగోష్టి చెప్పుకొనుచుండ, నీనైజము మానవుకదా?

విద్యా—లేదు-లేదు. అంత్యావశలో యౌవనదశ విపరీతమని యట్లంటిని తరువాతనేమైనది.

మహి—కావలసినంత యైనదిరాతండ్రి. బుద్ధిచాపలతవల్ల నాతలపై కత్తి నిక్కి పెదవులతో దానిచెక్కిలిపై యిట్లంటి. అంత నా రాకాసిముండ నాబుగ్గ పటుక్కున కొరికినది. ఘల్లున రెండవచెంపపై యీడ్చికొట్టినది. గూబగుయ్యిమనగా నేలపైఁబడితిని. వున్నవి రెండేదంతములు. రెండూవ్రాఁడి క్రిందపడినవి. దానిగోళ్లు కాల. చాటలవలెనున్న నఖములతో నావళ్లంత నెత్తురువరదలు చేసినదిరా. నాయనా! ఇక బ్రతుకనురాదేవుఁడా!

విద్యా—ఇదంతయు శృంగారచేష్ట. ప్రణయకలహము. తరువాత.

మహి—నాపెడబొబ్బలాలకించి వానరులనుమానింతురని నన్ను జంకఁబెట్టుకొని లంకలో ధుమికినది. ఆగంతునకే నామొముకలు పిండిపిండియైనవి. మూర్ఛవచ్చి నేలపైఁబడితిని. ఆముండకూతురు నన్నిచ్చటఁబారవైచి యెక్కడికో పోయినది.

విద్యా—నీకు కౌగిలిసుఖముకూడ కలిగించినది. ఇది సరస సల్లావవిశేషము- వింతవిలాసము.

మహి—నీవిలాసముమండిపోను. నాదేహము నుగ్గునుగ్గయినది.

విద్యా—రసికత్వ మెక్కువకాఁగా నిట్లేయుండును. భయపడకుము. కాని యారామాధమునిపై శూర్పణఖకుఁ బ్రేమయేలనో.

మహి—ఈముసలిముక్కిడి కొక్కెతెకేకామురా! బాబు- ఎందరో రక్కసులు మారువేషముతో రామునిచుట్టుమూఁగి వానిజూచి చూచి యానందించుచున్నారు.

విద్యా—ఆకిరాతుఁడు చక్కనివాఁడాయేమి చెప్పుమా?

మహి—వాఁడిచక్కఁదనము చట్టైనట్లేయున్నది. వట్టికర్రిమిరాద్దు. పొగబండిలోవేయు రాక్షసబొగ్గుతుండురా నాయనా. కోతులకు వలె పాదములవరకు వ్రేలాడుచున్నవి చేతులు. నాసికము చూడు మద్దిరోలువలె దిట్టముగానున్నదో. ఎన్నాళ్లనుండియో తిండిలేక యక్కళించుకొనిపోయిన వాఁడి పొట్ట నడుము చూస్తే యన్నమునకు ముఖంవాచినట్లున్నది. ఇట్టి హీనజంతువును మహారాజుసోదరి శూర్పణఖ యెట్లు మోహించినదిరా?

విద్యు—నిన్న శూర్పణఖ కంటినిండ చూడలేదు. లేకున్న నిన్ను విడచునదికాదు. అది నీవశమౌటకు సాధనము చెప్పెదనుస్సు.

మహి—నాతండ్రి యెట్లు? చెప్పు చెప్పు.

(నిష్క్రమించుచున్నారు.)

## ద్వితీయాంకము—రెండవరంగము.

### అశోకవనము.

(సీత, రాక్షసస్త్రీలు ప్రవేశము.)

సీత—

ఉ॥ ఎన్నడుదాటునో జలధి యెన్నడు లంకకువచ్చిచేరునో
యెన్నడుచంపునో యసుర నెన్నడు నాచెరఁబాపిపుచ్చునో
యెన్నడుయెన్నఁడా యినకులేంద్రునిజేరి సుఖించుటంచు నా
కున్నదియాసగంపెడు సుఖోదయమున్నదొలేదొ దైవమా?

ఉ॥ వాయుజుఁడేగెనా? సముమ వాయుపథంబున డస్సిదిక్కెనా?
మాయలమారి దానవుని మాయలలోఁబడి మోసపోయెనా?
సాయముచేయకూడదని సాధువరేణ్యుఁడుపేక్ష జేసెనా?
సేయునదేమిలేదు విధి చే తలకెల్లఁదలొగ్గటొక్కటే.

శ్రీరామచంద్ర! నిర్భాగ్యురాలనగు నన్ను బరిణయమందినందున కదా మీకీక్లేశములు.

గీ॥ ఏకపత్నీవ్రతుండ ! నే నీ నేగినంత
జీవయాత్రలనొంటరిఁ జేయవలసె
యజ్ఞయాగాధికారము లంతబోయెఁ
సూర్యకులమింక సున్నయే సుతులు లేమి.

అయ్యో ! యెంతకష్ట మెంతకష్టము.

సీ॥ లేదుకదా భార్య లేఁ బ్రియమున మీకు
కామసుఖంబులు గలుగు టెట్లు
లేరుకదా సుతుల్ లేనవ్వులను జూప
ముద్దుముచ్చటలు మూలఁబడవె
పోవుఁగదా కర్మ పుణ్యాధికారంబు
లూర్ధ్వలోకము లెట్లు నొందవఁగలవు.
కాలెఁగదా సూర్య కుల భాను తేజంబు
గతులు మీకెవ్విధిఁ గలుగునింక

గీ॥ నాదు కారణమునఁ జేసి నాథ మీకు
నెన్ని దుఃఖములున్నవో నేమి సేతు ?
నేమి దోచకున్నా మది కేమి తెరువు ? .
యెట్లు దాటుదు శోకాబ్ధి నేదిగతియొ.

ధూమ్రాక్షి — ఓసీ ! సీత ! ఎంత వెర్రిదానవు. కంటికి ధారవలె సదా విలపించెదవు, ప్రయోజనమేమి ?

గీ॥ దశసహస్రకోటి దనుజ దండనాథ
పాలితములంక శక్యమా పరునకిఁ జొరఁ
బాందోలుము రాముపై బాళిమాని
రాక్షసేశ్వరుఁ జేరుము రమణి వినుము.

దీర్ఘనాస — ఓసి ! నీమేలు నీ వెరుగకున్నావు. ఆ తుచ్ఛ మానవునిపై యాసలు విడువుము.

చ॥ వననిధిమధ్యమున్న సుర వధ్యనివాసములంక యేడ ? యా మనుజుఁడు వచ్చుటేడ ? చర మాపుట యేడ! కురంగలోచనా!

జనకజ ! రాఘవాధముఁడు । చాలునె రావణునొద్దనిల్వగాఁ
గనవుకదా ! సఖీ ! తెరువు । గంజదళేక్షణ యేమిచెప్పుదున్.

లంబోదరి___సీతా ! మతిలేక యంగలార్చెదవు. సురాసురాజేయుండు, త్రిలోకేశ్వరుండు, సకలదానవ రాజ్యాభిషిక్తుండు, లంకాధిపుఁడు, రాముఁడుగీముఁడు గోటికిసాటియా. నీవెర్రిమానుము. ఆతుచ్ఛమానవుని మాటఁ జూరఁజెక్కి మహారాజుశయ్యపై సుఖింపుము.

సీత___రామ, రామ (చెవులుమూసుకొని)

గీ॥ వదరుబోతులు నోటికి । వచ్చినట్లు
దనుజకాంతలు రాజాజ్ఞ । దనువఁగోరి
వదరుచున్నారు క్షమియింపు । వారిజాక్ష
రామరఘురామ శ్రీరామ । రామరామ.

(రావణుఁడు, విద్యుజ్జిహ్వుఁడు ప్రవేశించుచున్నారు.)

రావ___

ఉ॥ మాసినచీరగట్టికఁడు । మాసినభూతలమందుఁజేరి యీ
మాసనవంబు సంతసము । మాని మనోవ్యథజిక్కి కుందినన్
భాసిలుచున్నదార ! నిజ । భావము రాగునె మూతవేసినన్
మూసినదాచిపెట్టినను । మూలలకుఁదోసినఁ జాటుచేసినన్.

దీర్ఘ___సీతా మేమెంతఁజెప్పిన నీకు చీమకుట్టినంత చురుకైనఁ గలుగలేదు. ఔరా ! నీపంతము.

గీ॥ బ్రతుకుపైయాశ కలదేని । పట్టువిడిచి
దనుజవల్లభుదరిఁజేరి । ధన్యవగుము.
యతివయురచేతనాడించు । నతఁడునిన్ను
రసికగణ్యుఁడు రాక్షస । రాజరాజు.

రావ___దీర్ఘనాస పూర్తిగఁ జెప్పినదికాదు,

చ॥ ఉరమునఁజేర్చి దింపక స । రోజదళేక్షణుధిక్కరింపనా
శిరమునజేర్చి యాశివుని । సిగ్గుపడంగనుజేసిపుచ్చనా ?

వరుసను రామచంద్రవర ξ వాహిని నూడిగమందునుంచనా ?
సరసిజనేత్రి ! నీపదము సన్నిధి ξ జేసుక సేవసేయనా.

విద్యు—నేనొక మానవకాంతగాఁబుట్టిన మహారాజులందరు నాచరణదాసులై యుందురుకదా ?

రావ—

సీ॥ అశ్రుపూరితమయ్యె ξ నందంబుచెడనట్టి
యాకంటిసోయగ ξ మెంతకలదొ
వేడినిట్టూర్పుల ξ వేడికిమ్రగ్గిన
యోనాగమోవి తీ ξ రెంతకలదొ
చింతచేసొక్కియు ξ జిగిచెడకుండిన
యీరామతనుదీప్తి ξ యెంతకలదొ
ధూళిదూసరమయ్యు ξ తొలఁగకఁగఁళదేరు
నీశాంకముఖకాంతి ξ యెంతకలదొ
గీ॥ ఏమ్మెలోనైన పరభృత ξ మేలననగ
మించినవిపంచిపంచమ ξ మేళగింపు
నీసడించెడుగాత్రిమిం ξ కెంతకలదొ
భామకౌగిటఁజేర్పఁగ ξ బ్రతుకఁగలనె.

విద్యు—పురుషజన్మ నిరర్థకము-నిరర్థకము. విధిననేన్నల స్త్రీగాఁ బుట్టింపఁడయ్యె? రాజాధిరాజులు నాపాదసేవకులై యుందురుకదా.

లంబో—ఓసి. మైథిలి !

గీ॥ ఏనుపట్టినకుందేటి ξ కెంచమూఁడె
కాళ్ళనివిదువవుకద నీ ξ కఠినమేమొ !
రాలనిగ్గించె నీగుండె ξ రమణినిజము.
కాంతలకునిట్టి కఠినము ξ కలదెభువిని.

రావ—చెలికాఁడా - అటుచూడుము—

సీ॥ చక్రవర్తులనేని ξ సరకుఁజేయనిఠీవి
యమరియున్నదిసీత ξ యాననమున

రాజాధిరాజుల | రమ్యసౌమ్యాననంబులు
గాంభీర్యమీనెడు | కనులతీరు
పదునాల్గులోకముల్ | పాలింపఁజాలిన
పటిమదోఁచెడుఫాల | ఫలకమందు
నెల్లరాజ్యంబుల | నేలికసానినా
కలుకుచున్నదియూర | కురులసౌరు
గీ॥ దనుజకాంతలమాటలు | దరికిఁదోసి
తనదుభావంబులోపలఁ | దలచునేదొ
లెక్కసేయునె జానకి | రక్కసులను
తృణముకద రావణుఁడుదీని | దృష్టియందు.

విద్యు—మహారాజుగారే గడ్డిముక్కలైనయెడల- మాబోట్లగతి యేమి- పాతపేలికలముక్కలో, పుల్లిస్త్రీకులచెక్కలో.

లంబో—జనకజా!

గీ॥ చాననిన్నోరె రావణ | చక్రవర్తి
వసుధశృంగార ఘనచక్రి | వర్తివీవు
మీకు దాంపత్యమబ్బిన | మిథిలతనయ
కనకమునకు సువాసన | కలిగినట్లు.

సీత—ఛీ నోరుమూసుకొనుము. కౌసల్యానందన! రఘురామ! ఇట్లు పేలుజేయుటకు నాతప్పేమి?

సీ॥ కలనైన నీపాద | కమలసేవయెకాని
పరభావమెన్నఁడు | పట్టుపడదు
సర్వేశనీనామ | సన్నుతియేకాని
యితరమన్నను మది | కెవ్వుమనదు
దశరథాత్మజనిన్ను | ధ్యానించుటేకాని
తలపులుపరులపైఁ | దగులవెవుడు
యాటపాటలమిమ్మ | నర్చించుటేకాని
యన్యమెన్నఁడు లోన | నాదరింప

గీ॥ ఇవుడు నేఁజేయుతిప్పిదా ♦ యెరుగరాదు
నాడు కాకాసురుసినీచ ♦ నడతకలరి
చూపినట్టిపౌరుష మెటఁ ♦ జొచ్చెనయ్య
కాలగతికాని వేరేమి ♦ కలదుమహిమ.

రావ.—అహా ! ఆరాముహతకుఁడు కడుధన్యుఁడు. ఈతలోదరి ! ఈ జాళువాబొమ్మ ! ఈశృంగారమూర్తి ! రాముని దైవముగా భావించుచున్నదే.

విద్యు—దేవరగుణంబు లపారంబులు. ఎరుగమి రామాఘమునిపై వలవు వివుఁజాలకున్నది.

రావ—రాక్షసాంగనలు నావిషయ మశ్రద్ధవూనిరనియా నీయభిప్రాయము.

విద్యు—వారెన్నడు రాజాజ్ఞ నుల్లంఘింపరు. అనాగరికలగు రాక్షసవనితలు మహారాజుగారి సుగుణగణనయందసమర్థులు.

రావ—సర్వజ్ఞుండగు విద్యుజ్జిహ్వుఁడు చక్రవర్తికి సాహాయ మొనర్పఁడా ?

విద్యు—మహారాజసేవకులకు దూతసుఖము తరుచునలవడియైయుండునుకాని, కాంతలు తమప్రియులగుణంబులు ప్రియులనోట నేవినఁగోరెదరు.

రావ—రావణుఁడు తన్నుఁదాఁ దెల్పుకొనువాఁడు కాఁడె.

విద్యు—పరులకు సీత మీకు యర్థాంగికానున్నదికదా. పరవనిత యెట్లగును. భార్యతో మనవి! తనలోతానను కొనుటయే. ఆత్మస్తుతికానేరదు.

రావ—అట్లైన నేనే యెరిగించెద.

దీర్ఘ—సీతా ! నీవు సౌందర్యరాసివని గర్వపడుచుంటివికాబోలు. మహారాజునకు దివ్యాప్సరసలనేకులు కలరు. నీవు వారినిబోలఁ గలవా ?

(రావణుఁడు సమీపించి)

రావ—దీక్షనాస తప్పాడినది.

గీ॥ ఇందరేటికి నిన్గూడి యిందువదన
యేకపత్నీవ్రతుండనా యెన్నఁబడుదు
చుక్కలేటికిపదివేలు సుందరాంగి
చాలఁడా శరత్పూర్ణిమ చంద్రుఁడొకఁడు.

సీతా! పలుకవేమి?

సీత—గీ॥ అన్యపతిముఖమెట్టిదో యసురనాథ
యెన్నఁడైననుజూడక యేకపత్ని
దీక్షనున్నట్టి రఘురాము ధీరవరుని
సాటియౌనీకుఁ బలుకాకి జారచోర.

వక్కా—దేవసాధునకు, దోమకు యేనుగకు, పాతాళమునకు స్వర్గమునకు పోలిక సరిపడునేమో కాని, నిన్నయినకులేశ్వరునకుఁ బోల్చుట నెంతమాత్రము సరికాదు.

రావ— మేలు! సీతా! మేలు.

ఉ॥ కుంటియొకుడ్డియో మరియుఁ గూటికిగుడ్డకులేని పేదయో
యింటికివచ్చెఁజాలునని యేకసతీవ్రతదీక్షబూని వాఁడ్
గంటలఁగంటఁజూడమి యఘట్టితనంబు విశాలలోచనా
యొటరికత్తెతో ననుభవోద్ధతిపూర్ణత నొంగనేర్చునే.

రసికులు భ్రమరములవంటివారు. పరిపూర్ణానుభవసిద్ధే వారిలక్ష్యార్థము, దానికై స్త్రీజనంబులఁ బరిశోధించి సౌందర్యమాధుర్యమోదం దెట్లుండునో యట్లనుభవింతురు.

సీత—ఇది కాముకులశాస్త్రము. నీవు కాముకుఁడవు! ఏకపత్నీవ్రతము నీకు కడుదూరము. కులశీలసౌందర్యమందనురూపయగు నొకసతియందు పూర్ణానుభవముకలుగదా? ధర్మసంస్థాపనాచార్యుఁడగు రఘురామునకు నీకు సాటియా? పోపొమ్మో

రావ—కాదు-కాదు.

సీ॥ ఎదురుగావచ్చిన | మెలనాగపై క్రూర
శరమేసి నిర్దయఁ | జంపఁగలమె ?
సిరి రాజ్యసంపద | చిన్నమ్మకర్పించి
దారిద్ర్యమందు చిం | దాడఁగలమె ?
కామించితనుఁజేరఁ | గాంతపై దయమాని
కోపించినాసికఁ | గోయఁగలమె ?
ఆకటఫలమని | యతివపై వ్రాలిన
పక్షిపై నస్త్రంబు | బరుపఁగలమె ?
గీ॥ పాతపడి చీకి యెండకుం | పండినట్టి
పింటినొకచేత వీకతో | విరువఁగలమె
పరుఁడు తనకాంతనెత్తుకఁ | బారుచుండ
నోర్చిచూచుచు నొకమూల | నుండఁగలమె.

సీత—వీరాధివీరుఁడు, సకలక్షత్రియాగ్రగణ్యుఁడగు రఘునాయకునితో నీకు పోల్కెకూడనా ?

రావ—ఇతనిఁ ద్రిలోకభయంకరుఁడగు రావణచక్రవర్తి గానెరుగుము. నీపతియో !

సీ॥ ఖరుఁడాదిమాదొ్ర్నఁ | గడిమిఘాతకునోడి
వెనుకంజవేసిన | వీర్యయుతుఁడు
తలలేనిమొండెమున్ | దాఁజంపఁగాలేకఁ
దమ్ముని వేడిన | ధైర్యశాలి
యెదురుపోరగలేక | నేచాటునోనుండి
వాలినేసినమహా | వంచకుండు
భటవాజిరథసింధు | పటుసైన్యములులేక
కోతులఁగూర్చిన | కూళయితఁడు
గీ॥ స్వయముగా నన్నెదుర్కొన | శక్తిలేక
భీరుసుగ్రీవువేడిన | బేలయితఁడు
రాజరాజ దానవ | రాజరాజ
పటుభయంకరుఁడేప యా | పంకజేడ.

సీత—ఓరీ ! నీచదానవ. త్రిలోకేశ్వరుని, సకలభువనాతీతుని నిం దించి పాపమొడిగట్టుకొనుచుంటివా ?

రావ—ఆహా ! ఆయయ్యమహిమకు నీయువతి పొగడుటకు సరి పోయినది. సుందరీ ! నీవాతని భార్యవగుటచే నాహీనుని దైన మని నెంచితివేమో ? ఆయసమర్థుఁడు - ఆయవివేకి - ఆయజ్ఞాని సర్వేశ్వరుఁడగునా ?

చ॥ జనకునిమాటనమ్మి।తన ¦ జన్మకులంపక రాజ్యమిచ్చి, యా
ఘనవనసీమఁజొచ్చి కడ ¦ గండ్లకుఁ బాలయి కాంతబాసి బల్
మనసునకందికుంది తన ¦ మానముగోల్పడి యూరకుండునా
జనకజ ! నీదుభర్త ! మను ¦ జాధముఁ డీశ్వరుఁ డైనఁ జెప్పుమా.

సీత—ఓరీ ! క్షుద్రరాక్షస ! వాలినేసినబాణము వమ్ముపోయె నను కొంటివా ? ఖరదూషనాదిదానవులఁ ఖండించిన శరవునీ పది తలల నేలఁబడ వేయ రఘువీరునిసత్తునెత్తు నీవే యెరిగెదవు.

రావ—ఓసీ ! వ్యర్థప్రలాపి ! నీచమానవున కొకనికి నాశిరములఁ బడ వేయ సాధ్యమనుకొంటివా ? ఇదుగో యానీచాధముని శిర ముఖండించి తెచ్చితిమి. కన్నులఁ గనువునీరఁజూడుము (రాముని శిరము పడవేసి పారిపోవుచున్నాఁడు.)

సీత—హానాధ ! (మూర్ఛపోయి లేచి ) త్రిలోకాధినాధుండవై ముజ్జగంబుల నేలెదవనుకొంటినిగాని యొకనీచదానవునిచే మడ సెదవని కలనైనఁ దలచితినా ? రఘునందనా ! వాయునందనుం డేగినపిదప నీరాక కెదురుచూచుచుఁగాలము గడుపుచుంటి. నా యాశలు నిరాశలుజేసి నన్నొంటరిగా నీరాక్షసభూమియందు విడిచిపోవ నీకు న్యాయమా ? త్రిలోకైక ధనుర్ధరుండవు. నీచ రాక్షసున కెట్లుచిక్కితివి. కాలగతి నెవరుతప్పింపఁగలరు! శ్రీరా మచంద్రా ! నీవులేకున్న నాకీజగమేల ? యీతనువేల ? ఈ ప్రాణమేల ? నీవియోగదుఃఖమెట్లుభరింతు? ప్రాణప్రియా ! నానిమిత్తమున నీకెంతటిపాటు సంభవించె. దైవమా ! నీకేమి యపకార మొనరించితిని. నన్నిట్లు శిక్షింప నేఁ జేసినతప్పేమి ?

సౌమిత్రీ! నిన్ను దూషించిన ఫలంబనుభవించుచుంటి. కౌసల్యాదేవి యింక జీవించునా? అయ్యో! సూర్యవంశము నశించుఁగాఁబోలు. ఈనిర్భాగ్యురాలు, యీవివేకరహిత, యీసీత యినకులంబునకు ముసలమై జనించినదే! ఓసీ! జానకీ! నీవ్యర్థపు జన్మనింకేల దీర్ఘమొనరించెదవు? నీనాథుని వెంటఁ బోక నిందుండేమిచేసెదవు నాథా! పోవలదు! పోవలదు. ఒకక్షణమాత్రమాగుము. నీకుపచారముచేయ నీదాసి సీత నీవెంటనంటివచ్చుచున్నది. (అని కంఠమున కురివేసుకొనును.)

(సరమ పరుగునవచ్చి)

సరమ—గీ॥ ఆగు మాగుము నీకేల ? యతివ చావఁ
జచ్చువారలు రాక్షసుల్ ? చాన నీదు
భర్త రాముఁడువచ్చి భూ ? భారముదీర్ప
దండువిడసె సువేలాద్రి ? దరినిజూడు.

రఘురాముఁడు సకలప్లవగవీరసేనాతండముతో సముద్రము దాటి వచ్చియున్నాఁడు. విద్యుజిహ్వానిర్మితమగు మాయాశిరముగాంచి విలపించనేల? రావణాధముని యసత్యప్రలాపములనమ్మితివా? నీకు శుభంబగుగాక. అమంగళము శాంతించుగాక.

సీత—ఇది మరియొక దానవమాయ నమ్మరాదు.

సరమ—జనకజా! అట్లు పరికించిచూడుము. యుద్ధసన్నాహము లెట్లుజరుగుచున్నవో? మత్తమత్తేభంబుల బృంహితంబులు యుత్తమాశ్వముల హేషారవంబులు రథధ్వానంబులు వినవచ్చుచున్నవా? దంధణాయను రణభేరీభాంకారము కర్ణగోచరమగుచుండలేదా? (లోపల కలకలధ్వని) ఆకలకల మాలింపుము.

అంగ—(నైపథ్యమున) ఓహో లంకనివాస దానవయోధములార! శ్రీరామునిదూత, వాలినందనుఁడు. యంగదకుమారుఁడ, రావణాధమునిజూడలంక ప్రవేశించుచున్నాఁడు.

(అంగదుఁడు జండాపట్టుకొని కపిలుఁడు ప్రవేశించుచున్నారు.)

అంగ—అతఁడా సర్వసేనాధిపతి ధూమ్రాక్షుఁడు కావచ్చును.

కపి—తణిఖీయుద్యోగస్తుని శిరస్త్రావలె బిర్రబీసుకొని నిటాకారము గానున్న వీఁడెవఁడు ?

అంగ—రావణాధముని ముఖ్యమంత్రి ప్రహస్తుఁడు కానగు.

కపి—ఎన్నినోళ్లు, ఎన్నిచేతులు, నల్లగా కాటుకకుండవలె మధ్య నున్నది దయ్యమా భూతమా ?

అంగ—అతఁడా దశకంఠుఁడు. సీతాదేవ్యాపహారి.

కపి—అన్నినోళ్లెందుకు. త్రాగుట కొకనోరు చాలదా ? భోగస్త్రీని కౌఁగలించుటకు రెండుచేతులు చాలవా. రామచంద్రా ! వారం లో పానియుండల కౌఁగలించుట కిన్నిచేతులుండవలె కాఁబోలు.

అంగ—కిష్కింధకు యువరాజు, వాలినందనుఁడు, శ్రీరఘురాముని దూత. అంగదకుమారుని సందేశము వినుమురా !

రావ—రామహతకుని సందేశము సవిస్తరముగ విన్నవింపుము.

అంగ—శ్రీరాముని వాక్యములు వినుము.

క॥ జనకజనికూతురు దశరథ
జనపాలునికోడలు సతి ॥ జానకిఁగొని రాఁ
జనునే దొంగిలి రావణ
యనలంబొడిఁగట్టుఁజలశి ॥ నాయె నెకితవా !

ఓరీ ! నీచరావణా.

గీ॥ బ్రతుకుపై నాశ రావణ ॥ ప్రిఁబలియున్న
వచ్చి శరణనిజలజాక్షి ॥ నిచ్చి మనుము
లేదబంధుమిత్రుల ॥ లీలఁజంపి
లంక సాధించి కూల్చెద ॥ లావుజూపి.

కపి—మీయందరనోట గడ్డి. విభీషణునకే రాజ్యము.

అంగ—నీవు దానవచక్రవర్తివి, త్రిలోకేశ్వరుఁడవు, సకలవిద్యాపారంగతుఁడవు, నీకు తెలియనిధర్మము కలదా ? అయినను

నాకుఁ బితృసమానుండవుకాన నీమేలుగోరి నేనొకహితము
జెప్పెదను వినుము.

చ॥ ఎరుగుదువీవు వాలిబల । మేకశరంబునఁగూల్చి నాతనిన్
ఖరునిముహూర్తమాత్రమున । ఖండనజేసెను దూషణాదులన్
సరకెను రామభూవిభుఁడు । నమ్మ్రతివో నరుడంచురావణా!
సురవిభుతుల్యుఁడైన రణ । శూరుని రాఘవు కోసలేశ్వరున్.

వరమహాత్మ్యమున దేవయోనులచేఁ జావననిగర్వించుచుంటివేమొ.

కపి__అదె! అదె! పాపము విప్పిచెప్పెను.

అంగ__

సీ॥ దశరథేశ్వరుపట్టి । దానవాంతకజెట్టి
దేవుఁడో మనుజుఁడో । తెలుసుకొమ్ము
కిష్కింధకు విభుఁడు । కీర్తితదేహుండు
దేవుఁడో ప్లవగుఁడో । తెలుసుకొమ్ము
లంకకాల్చినమేటి । లాంగూలఘనధాటి
దేవుఁడో కోతియో । తెలుసుకొమ్ము
భండనవీరుండు । భల్లూకనాథుండు
దేవుఁడో యెలుగుయో । తెలుసుకొమ్ము

గీ॥ గవయగంధమాదననీల । ఘనులు పనస
నలసుషేణగవాక్షులు । నాగబలులు
వనచరులుకార యెరుగవే । వారిజాతి
దేవయోనులఁబుట్టిరే । తెలుసుకొమ్ము.

కపి__గుండెల్లో రాయిపడినది. లంకకోతులకుఁ గొండముచ్చులకు,
నెలుగొడ్లకు స్వాధీనమగును.

అంగ__రాక్షసేశ్వరా!

గీ॥ జనకజాత్మజనీపాలి । జముఁడుసుమ్ము
మృత్యుదేవతదెచ్చితి । మోహమంది
నిన్ను నీవారిజంపక । నీరజాక్షి
యూరకేపోవునానీదు । యూరువిడిచి.

కపి—ఇక సురాభాండములకు సెలవు. పానముండలకు నాట్టేమున్ను.

అంగ—రాక్షసచక్రవర్తి! ఇంకొకవిశేషము చెప్పెదవినుము. వాలి నీకు పూర్వపరిచితుండనా? ఏకశరముచే నతండు మడసెనను మాట వినియుండవా? జనకునింట శివవిల్లు నీవెత్తఁగలిగితివా? దానిఁ దుత్తునియలుజేసిన బలముచాలదా? నీకీవెర్రియేల? బ్రతుకఁదలచితివా రాముం దేవేరినిఁగొని నావెంటరమ్ము. నీకభయం బిప్పించెద. ఈసకలదనుజసామ్రాజ్యము చెడఁగొట్టకుము. ఈవైభవోన్నతి పాడుచేయకుము. నామాటలు వినవేని చచ్చుట నిజము, నిజము.

కపి—తప్పక, ముమ్మాటికిఁ దప్పక.

ఇంద్ర—హా! పాపము శమించుగాక. అమంగళము తొలఁగుఁగాక.

అంగ—

ఉ॥ నాకము నేలునట్టి సుర ꠶ నాయకుఁడైన పురారియైన యా
భీకరమూర్తి యాదిసుర ꠶ శేఖరుఁడైన నిశాచరేశ్వరా!
నీకనమర్థుఁడౌనె రఘు ꠶ వీరుఁడు చంపెఁగివానిబ్రోవఁగా
భీకరరామబాణములు ꠶ నీచమడంపకనిల్వవిచ్చునే.

రావ—ఔరా నీమదము. దానవచమూపతులారా. ఈవానరమును బంధించి వధింపుఁడు.

(నలుగురు పట్టుకొనుచున్నారు.)

కపి—అయ్యో. అయ్యో! నేనేమిసేతు. నాకు దారేది?

అంగ—బ్రాహ్మణోత్తమా భయపడకుడు. నాప్రజ్ఞచూడుము.

రావ—గీ॥ చెడుదువని బుద్ధిజెప్పఁగఁ ꠶ జెనటివగుచుఁ
జంపనెంచితి నీచేతఁ ꠶ జత్తునొక్కొ
రామదూతనుబంధించు ꠶ రాజులఁడె
మాదు నాప్రజ్ఞకన్నారఁ ꠶ జూడుమిపుడు.

కపి—ఆదెబ్బ. ఇది మీానమా! మరొకటా!

అంగ—ఓరీ క్షుద్రరాక్షస.

గీ॥ పట్టుకొన్నట్టి దనుజులఁ బారఁజిమ్మి
నీదు ప్రాసాదాగ్రశిఖరంబు నేలఁగూల్చి
పోవుచున్నాఁడ రాముని బోరఁబిల్వఁ
బట్టనేర్తువె నన్నియో పంక్తికంఠ!

కపి—యుద్ధమునకు సంసిద్ధులుకండు. చూడుడిక మా దెబ్బ.

(నిష్క్రమించిరి.)

రావ—అప్పు డొక వానరుఁడు లంకఁజొచ్చి, యశోకవనము విరిచి, పురముకాల్చి నిరాటంకముగఁ జనియె. ఇప్పుడొకఁడువచ్చి భీతిలేక నన్నుధిక్కరించి నోటికివచ్చినట్లు ప్రేలి, ప్రాసాదశిఖరముఁ బడఁ దన్నిపోవుచున్నాఁడు. మనబలములేల? ధనములేల? శక్తులేల? కాల్పనా!

ఇంద్ర—తండ్రీ! ఈమె ఘునాథుని వ్యర్థునిగాఁ దలచితివా? సురాసురులేకమై ఢీకొన్న వెనుకంజవేయువాఁడా? పురందరుని నిమేషమాత్రమున జయించి నీకొప్పగించలేదా? నేనుండ నీకీచింత యేల?

చ॥ నరునకు నింతభీతియగు నా దనుజాధిప రాముఁడెంతవా
నరులన నెంతవారలవి పాశముజేసెద నింతలోపలన్
బరపెదనాగపాశములఁ బట్టెదఁ గట్టెద నీదుముందటన్
సరగునఁ దెచ్చిపెట్టెద నవి చారము మానుము పోయివచ్చెదన్.

ప్రహ—దేవా! యువరాజుగారి మనవియంగీకరింపుడు. రామాధముని నిమేషమాత్రమున వధించి రాఁగలఁడు.

రావ—పుత్రా! నీకుసాధ్యముకానిది కలదా! ఆనరాధముని సోదరసహితముగ వధించిరమ్ము. కులద్రోహి విభీషణునిమాట మరచెదవుసుమా? పోయిరమ్ము. మంత్రివర యోచనామందిరమునకుఁ బోదమురమ్ము. (అందరు నిష్క్రమించుచున్నారు.)

రంగముపూర్తి.

## ద్వితీయాంకము—నాల్గవరంగము.

(సువేలా పర్వతము.)

(రామలక్ష్మణ సుగ్రీవహనుమదంగద విభీషణులు ప్రవేశము.)

రాము—యువరాజా! మూర్ఖుఁడు రావణుఁడు, నీహితము విన లేదుగా?

అంగ—వినకపోవుటేగాక, నన్ను బంధించి చంపనెంచె.

కపి—పట్టుకొన్న రాకాసిమూకల నేలఁబడఁజిమ్మి రావణప్రాసాద శిఖరము పడఁదన్ని వచ్చినాఁడు.

రాము—మేలు, అంగదా! మేలు! వాలినందనున కష్టమేమి? యుద్ధముతప్పదు.

విభీ—తప్పదు. తప్పదు. నీతివాక్యములు రావణునకుఁ బథ్యములు కావు.

హను—ఈవిషయమున నేనిదివరకే యన్నివాయింపుల వాయించి యున్నాను.

(లోపల కలకలధ్వని.)

రాము—ఈదారుణశబ్దమేమి?

విభీ—రావణుని జ్యేష్ఠపుత్త్రుఁడు. ఇంద్రుని నిముషమాత్రమున జయించిన త్రిలోకవీరుఁడు. మాయావి, సదామేఘమండలాంతర్వర్తి. జాగరూకతతో నుండవలయును.

(ఇంద్రజిత్తు విద్యుజ్జిహ్వుఁడు ప్రవేశము.)

ఇంద్ర—

శా॥ ఓరీ రాఘవ మానుషాధముఖలా ఽ యో నీచ! యోమర్త్యలా!
కారుల్ మాన్పెదరాత్మసాంత్వకుఁడనని ఽ గర్వంబుపోఁగొట్టకన్
పోరన్ జాలవు మేఘనాధువినవో ఽ పోనిచ్చునే ప్రాణితో
జారుల్ గెల్వఁజూతు నాదుశరముల్ ఽ బాహాబలంబిత్తరిన్.

అంగ—ఓరీ రావణీ!

శా॥ నీవున్ నీజనకుండు నీదుబలముల్ ꠶ నీసేన నీబంధులున్
నీవారందరు గుంపుగూడి గదియన్ ꠶ నేనొక్కఁడేచాలనే
నీవా? రాముని దాకువాఁడవధమా ꠶ నీవెంతపోపొమ్మి ఛీ
చావన్వచ్చితివంతెగాని దనుజా ꠶ సాధ్యంబెమమ్మోర్వఁగన్.

కపి—శ్రీరామచంద్ర! ఉన్నతపదవికెక్కింపఁబడిన తొత్తుబిడ్డవలెఁ బ్రేలుచున్న వీని నుపేక్షించనేల?

శ్రీరా—నీమాయలంజిక్కుటకు నేండ్రిఁడనుకొంటివా? తీవ్రబాణ పరంపరలపాలుకాకపోయి నీజనకునిబంపుము.

విద్యు—మాయక్రమ్మకతప్పదు. చూచెదవేమి?

ఇంద్ర—రక్తవర్షంబున మిమ్ముముంచి లేవనెత్తెద. (తుపాకీకాల్చు చున్నాఁడు. మేఘము క్రమ్ముకొని రక్తము వర్షించును.)

కపి—అయ్యో. అయ్యో. బాబో. (యేడ్చి గంతులువేయును.)

విభీ—నీమాయ నుపసంహారించెదఁ జూడుము. రక్కసునిమాయ నణచుటకు రాక్షసమాయకావలెను. (తుపాకీకాల్చగా వర్షము మానును.)

ఇంద్ర—గీ॥ లంకబుట్టితి తండ్రివి ꠶ లాతివాని
పగిది మర్మముల్ దెల్పుట ꠶ పాడియగునె
పుత్రవాత్సల్యమనుమాట ꠶ పోవనణచి
పరుని గెల్పింపఁజూచెదు ꠶ పాపమేమి?

విభీ—దుష్టులు తమంతటతామే మడసెదరు. ధర్మమువర్ధిల్లును. ఒకరు గెల్పింపనేల?

ఇంద్ర—నీవు నీమిత్రులుకూడ నంతమొందెదరు. ఇదిగో నాగాస్త్ర ము (తుపాకీకాల్చగా నాగపాశములు జుట్టుకొని యందఱుపడి పోవుచున్నారు.)

విద్యు—మేలు! మేలు! మేఘనాధునకు జయము, జయము. చలికి బిగిసిన మంచముకుక్కవలె బిర్రబిగిసి యందరుపడసిరి.

ఇంద్ర—వీరి మరణమహోత్సవము లంకలో చాటించుము. తండ్రి గారికి నేవిన్నవించెద.

విద్యు—వీపున, తలకుఁ, జేతులకు, నడుమునకు జండాలుకట్టుకొని లంకలో వీధుల తప్పెట్లతో, తాళములతో నూరేగవలయు. పోదము రమ్ము.

కపి—( లేచి భయముతో తొంగిచూచుచు ) అమ్మో! వచ్చె! వచ్చె! (తిరిగి పండుకొని యేడ్చుచున్నాఁడు.)

విభీ—బ్రాహ్మణోత్తమా!

కపి—నేకాదు! నేకాదు! నేనుజచ్చినాను. పీనుగజోలికిరాకుము!

విభీ—కపిలాచార్యా!

కపి—నాపేరదికాదు. కపిలుఁడుచచ్చి నాలుగురోజులైనది.

విభీ—విప్రవర్యా!

కపి—నేబ్రాహ్మణుఁడ కాను. నేను దాగుచున్నాను. నాకుముండ వున్నది. చతుర్ముఖపారాయణం నేర్చుకుంటున్నాను. మీలో వాఁడనే? నాజోలికి రాకుము.

విభీ—ఆర్యా! నేవిభీషణుఁడను. భయపడకుము. ఇటుచూడుము.

కపి—(లేచి చూచి యేడుస్తు) బ్రతికియున్నావా నాయనా. రామలక్ష్మణులు యేమైరితండ్రి!

(సుగ్రీవహనుమంత సుషేణులు ప్రవేశము.)

సుగ్రీ—విభీషణా!

కపి—అడుగో! (పండుకొని యేడుస్తు) నేకాదు బాబో! నేకాదు నాయనో (పెద్దకేకలువేసి యేడ్చును.)

విభీ—భూసుర. భయమువలదు. వీరు సుగ్రీవాదులు.

కపి—వైద్యశిఖామణీ. రామలక్ష్మణుల చెయ్యి చూచుచుంటే బ్రతికియున్నారా?

(రామలక్ష్మణుల సమీపించి పరీక్షించి.)

సుషే—రాజా! ఇట్లు పరికించి చూడుము. రామలక్ష్మణుల ముఖమునఁ జీవకళ కాన్పించదు. జీవస్థానములు తప్పలేదు. జీవించియున్నారనుటకు సందియము లేదు.

కపి—నాతండ్రీ! నానాయనే! నా బాబే! నేను వైద్యుల్లనర్థిల్లను. నాయిల్లంతా బంగారము కొనుమ ముందుగ తేను?

సుషే—దేవాసుర యుద్ధంబున మృతినొందిన దేవతల బ్రతికించుటకు దేవగురుండు దివ్యౌషధముల నాకుపదేశించె. ఈ వాయునందనుని బుత్తెంచిన నిముషమాత్రమునఁ దెచ్చును.

కపి—అందుకు సందేహమేల? తోఁకను నేలేనా!

హను—రామ, రామ, రామ సీతారామా—

(ఆకాశమునధ్వని. ప్రచండవాయువు. గరుత్మంతుఁ డాకాశము నుండి దిగును పాములు పారిపోవ నందరు లేచుచున్నారు.)

గరు—శ్రీరామచంద్ర! విజయీభవ! విజయోస్తు! నేపక్షిరాజును. గరుత్మంతుఁడను వాఁడ, నాయాగమనంబున మేఘనాధుని సర్పంబులు పారిపోయినవి. విషభయంబు మీకుఁదొలఁగుఁగాక.

రాము—గీ॥ ఖగకులోత్తమ నీరాక 8 కతన మేము
ధన్యులైతిమి ప్రాణముల్ 8 దక్కె మాకు
సూర్యవంశము నిల్చెను 8 సాబగుఁగాంచె
పితృసముఁడవు ప్రాణతులఁ 8 బ్రేమఁగొనుము.

గరు—ఇందు ప్రస్తుతికిఁగారణము లేదు. నీయందు వాత్సల్యతచే నేనిటువచ్చితి. త్రిలోకకంటకుఁడగు రావణుని దెగటార్చుము. నేపోయివచ్చెదను.

(నిష్క్రమించును.)

రాము—మహావీరులారా! మీరంద ఱొక్కుమ్మడి లంకపైఁ దాకుడు. మాయాప్రవీణులగు రక్కసుల నుక్కుమాపవలయు.

కపి—దేవా! నేమారువేషముతో నుద్యోగమునబెట్టి లంకలోఁ బ్రవేశించి వారిరహస్యముల మాయలఁ గనిపెట్టివచ్చెద.

రాము—విప్రవర్యా! నీవుభయస్తుడవు. నాయొద్దనేయుండుము.

కపి—రాక్షసులు వానరులకన్న వికారస్వరూపులుకారు. ఏదు నాలుగేళ్లు మీతో తిప్పఁబడుటచే నాకన్నియలవాట్లు కలిగినవి. నీయొద్ద వ్యర్థునివలెఁ గూర్చుండనోప.

రాము—సరే పోయిరమ్ము. జాగరూకతతో మెలగవలయు.

కపి—అందుకు సందేహమేమి? శ్రీరాముని వేడుకచెలికాని కిదివరకే యభయదానమియ్యఁబడినది.

(అందరు నిష్క్రమింతురు.)

ద్వితీయాంకము పూర్తి.






తృతీయాంకము — మొదటిరంగము.

లంకలో వీథి.

కపి — ఉద్యోగపిశాచమా! దేశము నేగతికిఁ దెచ్చితివి! బ్రాహ్మణోత్తముల స్నానసంధ్యలకు నీళ్లు తోడితివి. క్షత్రియుల క్షాత్రమునకు నీళ్లువోసితివి. వైశ్యుల వాణిజ్యమునకు సున్నఁ జుట్టితివి. శూద్రుల పనిపాటలకుఁ జాటకొట్టితివి. ఇప్పుడు మాలమాదిగెల నావహించుచుంటివా? ఎన్నిముప్పతిప్పలకు నన్ను గురిచేసితివి. అయోధ్యానగరమునఁగల గడపలనెల్ల నెక్కిదిగుటచేఁ గాళ్లుపడినవి. పెద్దలను మాటలేకఁ, బిన్నలను మాటలేక, నుత్తములనక, నధములనక, నందరిచుట్టుతిరిగితిరిగి వేసరితి. బాపనయ్యగారాయనువారు, నీచదువెందుకయ్యాయనువారు, పోపోయనువారు, రారమ్మనువారు కిరియనున్న! శ్రీరామవిభునిఁ జేరి, యేళ్లనకఁ, గోళ్లనక, వడవులనక, నగాధములనకఁ దింపితిప్పలుమాని పదునాలుగేళ్లు వెంటఁబడి పిశాచమువలె వేధించితి. ఉద్యోగముమాట దేవునికెరుక, నాపని నీరైనది. ఈలంకలో నుద్యోగలక్షణమెట్లున్నదో చూచెదను. అదుగో మహామారిజాతరముందు పోతరాజు జండావలె నిక్కుచు నెవఁడో వచ్చుచున్నాఁడు)

విద్యు — (ప్రవేశించి) వీడెవఁడో రామహంతకుని సేవకునివలె నున్నాఁడు. నీవెవరు? ఇంతనిర్భయముగ లంకలోఁ దిరుగుచుంటివి.

కపి — నేనొక నిరాదరనిరంజన నిరుద్యోగిని. ఉద్యోగాపేక్షచే లంకఁ జేరితిని.

విద్యు—నీకులమెయ్యది.

కపి—నేబ్రాహ్మణుఁడ !

విద్యు—సరి ! సరి ! శీఘ్రముగాఁ గాలికిబుద్ధిజెప్పుము.

కపి—ఏమండీ ! అట్లనెదరు. నేను బ్రాహ్మణుఁడను.

విద్యు—అందుకే ! నడవండి. బాపనయ్యకు నుద్యోగమెందుకు ? లంకలో బ్రాహ్మణున కుద్యోగముకూడనా.

కపి—సమస్తశాస్త్రములు చదివినానండి ! నాకు తెలియనివిషయములులేవు. వాదించి చూడుడు.

విద్యు—నీచదువు సంధ్యలు మాకెందుకు. ఎగదుడుపు దిగదుడుపు పెట్టుటకు. నీమంత్రాలెందుకు.

కపి—మరేమికావలెనండీ ?

విద్యు—నీకుద్యోగావేక్ష పూర్తిగానున్నదా ?

కపి—అయ్యో ! లేకేమండి. ఈతిప్పలన్ని యెందుకు.

విద్యు—అట్లైన మీరు ముఖ్యముగ మూఁడుపనులు నేర్చుకొనవలెను.

కపి—అవి యేమిటో. నీకముపుచల్లగా చెప్పుము.

విద్యు—మామంత్రిగారికి, సేనాధిపతికిఁ జతుర్ముఖపారాయణం రాత్రింబగళ్లుండవలెను. మీకేమైనా దొక్కశుద్ధియైనదా ?

కపి—చతుర్ముఖపారాయణం యేమిటండీ ! బాబు వేదమా వేదాంగమా వేదాంతమా ?

విద్యు—వేదం కాదు. నీమొకం- జూదం- పేక.

కపి—నేర్చుకుంటా బాబు ! నీవే నాకు గురుఁడవు. తండ్రీ ! మీయింటికి రోజు బండిఖర్చు, చమురుఖర్చు పెట్టుకొని వస్తాను.

విద్యు—మా రాజుగారికి రెంటిపైఁ బ్రేమ.

కపి—అవి యేమిటి. తండ్రీ ! తొందరగాఁ జెప్పుము.

విద్యు—పీత్వా - బుద్ధి - సురాపానం, యొకటి.

కపి—ఇంతవయస్సువచ్చినది. ఇంతవరకు గోప్యంగాఁ గాలయాపనం జేసినాను. ఇప్పుడాసురాపానం?

విద్యు—ఉద్యోగం దొరకడ మూరికేనా? మామంత్రిగారుకూడ యిప్పుడిప్పుడే నేర్చుకొనుచున్నారు.

కపి—ఈజంఝాట్యాలేమిచేయాను? బాబు!

విద్యు—ఆసమయానికి యడరివలెనే రొండినిదోపుము.

కపి—సరే! తండ్రి! ఇంతటితో యుద్యోగం పట్టునా?

విద్యు—ఆ! పట్టకేమి? ఇంకొక చిన్నసంగతియున్నది.

కపి—అదేమిటి నాయనా? చావుకబురు చల్లగాఁజెప్పుము.

విద్యు—రావణ చక్రవర్తియనే కాప్సరసలతో విహరించువాఁడు. చక్కని నడికాలపు వనితను సంపాదించితివా? మంత్రిని యూడదీసి నీకుఁ దప్పక నాపదవి నిచ్చును.

కపి—అయ్యో! నాగతి! తార్చుడమా మొదటనేర్చుకొనుట. ఉద్యోగదయ్యమా! నీవుచేయించని కార్యమేది? బాబు! అట్టి పడతి నాకెక్కడదొరుకును. అన్నిటికి నీవే నాకుదైవము.

విద్యు—నేను సాధనము చెప్పెదను. మహారాజుకు సీతపై మోహ మెక్కువ. విన్నావా?

కపి—తెలియకపోవడమేమి. ఈయాభ్యాటమంతయు నిదేకదా?

విద్యు—మారాజు చెల్లెలు శూర్పణఖకు రామునిపైఁ బ్రేమ.

కపి—ఈకథ కంతకు మూలమదే.

విద్యు—రాముఁడవైతివా సీతనిన్ వరించుమని రావణునకు బోధించి రాముని వేషము వేయించెదను. సీతవైతివా నిన్ను బ్రేమింపుమని శూర్పణఖతోఁజెప్పి సీతవేషము వేయించుము. అప్పుడు నీకు నుద్యోగము తప్పకదొరుకును.

కపి—భళే! భళే! గురువంటే నీవేగురుఁడవు. ఆముండయింటికి నేనుపోయి మాయచేసి నేమమువేయించి తెచ్చెదను.

(అని నిష్క్రమించును.)

విద్యు—నాకిదియొక వినోదము. ఇప్పుడు మామహిషముఖుఁడువుంటే బాగుండును. వాఁడు చాలరోజులనుంచి కనుపించుటలేదు.

(మహిషముఖుఁడు ప్రవేశము.)

నీకు బ్రహ్మాంతాయువు. నీమాటే యనుకొనుచుంటిని. ఇన్నాళ్లెచ్చటనుంటివి.

మహి—ఎంతమోసము. ఎంతఘోరము. రండాకొడుకెంతద్రోహ్యము చేసినాఁడు.

విద్యు—ఏమిద్రోహమునిగినది?

మహి—ఏమిచెప్పను. నాకొడుకు నాతద్దినం పెట్టుచున్నాఁడని, పిండివంటలు మించిపోకుండ రమ్మని నాబావమరది శుంఠకాయ యుత్తరము వ్రాసినాఁడు.

విద్యు—నీతద్దినమే?

మహి—ఆ! నాతద్దినమే. తీరావిను.

విద్యు—బ్రాహ్మణార్థమునకైనా వెళ్లినావా?

మహి—వెళ్లకేమి, వెళ్లకేమి? వెళ్లేసరికి నాభావమరది భోజనము చేసి వాకిటలోనికి వచ్చినాడు. అయ్యో బాబో తద్దినం మించిపోయినదేమో. భోజనం తప్పిందిరాయని లోపలఁజొరఁబడి యక్కడ విస్తరివుంటే లాగి ముందువేసుకొని కూర్చుంటిని.

విద్యు—నీభావ భోజనంచేసిన విస్తరేనా?

మహి—అదేమి యేమిపో! మొండలోనుంచి వెళ్లితిని, భోజనము నకుఁ గాలముకూడామించినది. కళ్లుతిరుగుచున్నవి. కనిపించి నటకాదు. గారెలు, బూరెలు, బొప్పట్లు తెమ్మని కేకలువేసినాను. అంతలో భావమరదిగాఁడువచ్చి భావకుఁ బిచ్చియెత్తినదని జుట్టుపట్టుకున్నాఁడు.

విద్యు—బొబ్బట్లుపడ్డవా ?

మహి—అట్లు మాటయటుండనీ ! నాతద్దినం నేరాకుండా పెట్టినారని నాకుకోపం తలకెక్కినది.

విద్యు—బొబ్బట్లమాట చెప్పు.

మహి—ఆకోపంమీద మాభావమరిది కాళ్లుపట్టుకొని యీడ్చి నరికేం గిరిందపడినాఁడు. అందరు మూగినారు. నాతద్దినం నేను వచ్చేవరకు నాపవద్దాయని నాపెళ్లాం జుట్టుపట్టుకొన్నాను. అంతలో మాభావలువచ్చి వీపుమీద నల్లుతేలేటట్లు వేసినారు.

విద్యు—నీశాస్త్రం. నీవు బ్రతికియుండగా నీతద్దినమేమిటి.

మహి—పెద్దవాఁడు వ్రాసినాఁడని నమ్మినాను. కాని మాభావ వ్రాయలేదట. ఎవఁడో గుష్టుముండాకొఁడుకు వ్రాసినాఁడు.

విద్యు—లంకలో సమాచారమువిన్నావా ? సీతకొఱకు రాముఁడు లంకముట్టడించినాఁడు. యుద్ధం జరుగుచున్నది. నాయకు లనేకులు జచ్చిరి. కుంభకర్ణుఁడు గతించెను.

మహి—మనకుంభకర్ణమహారాజే. అయ్యో! అయ్యో. శూర్పణక ముండ లంకకుఁ జేటుదెచ్చిబెట్టినది.

విద్యు—ఇంద్రజిత్తు మాయసీతను రామునిముందు నరుకఁబోవు చున్నాఁడు.

మహి—శూర్పణఖ సంగతియేమైనదిరా ?

విద్యు—నీవు రాముఁడవై కూర్చొనుము. దానికి సీతవేషము వేయించి నీవద్దకు తీసుకవచ్చెదను.

మహి—నీకడుపుచల్లగా మంచియోచనచేసితివి. ఇప్పుడే రాముఁడ నయ్యెదను. మరచిపోయెదవేమో.

విద్యు—లేదు. లేదు. రమ్ము. సిద్ధపడుము.

(నిష్క్రమించిరి.)

మొదటిరంగము పూర్తి.

### తృతీయాంకము—రెండవరంగము.

### యుద్ధభూమి.

రాము—తమ్ముఁడా!

క॥ నిమ్మకు నీరెత్తినట్టుల
సొమ్మసిలిన వేటమీకము ♦ సొంపుననుండెన్
తమ్ముఁడ! యీపురిరక్కస
దొమ్మరి యేమాయచేయఁ ♦ దారకొనెఁజెపుమా.

(లోపల మాయాసీత యేడ్పులు.)

మాయా—శ్రీరామచంద్రా! దీనబంధో! శరణాగతవత్సలా! రఘునందనా! దిక్కులేని నీతలోదరిని మేఘనాధుఁడు మెడకోయుచున్నాఁడు. రక్షింపుము. రక్షింపుము.

రాము—ఆర్తధ్వని—నామనోహారిణి. స్త్రీఘాతకుండవగు నోతుచ్ఛరాక్షస! నీశిరంబుఖండించి మేఘమండలముదాట విసరెదను. నిలు. నిలు.

(రామలక్ష్మణులు పరుగునఁ బోవుచున్నారు.)

(ఇంద్రజిత్తు మాయసీతను గొప్పబట్టి యీడ్చుకొనివచ్చి)

మాయ—రాఘవేంద్రా! శ్రీరామచంద్రా! కాపాడవేలు.

రాము—ఇదేవచ్చుచున్నాఁడ, భయపడకుము, భయపడకుము.

(ఇంద్రజిత్తు మాయసీత తలఁద్రెంచిపోవుట.)

మాయ—హా! హా! రామచంద్ర:—(నేలకూలును.)

రాము—హా! హా! (వచ్చి సీతపైఁబడి మూర్ఛనొందును.) లక్ష్మణుఁడు కూలఁబడును. రాముఁడు లేచి.

గీ॥ ఎంతగతిపట్టెనేసతి ♦ యేమనొద్ద
నిలిచి కన్నారఁగన్గొన ♦ నీదుశిరము
గోసె నొకనీచదనుజుఁడా ♦ క్రూరకర్మ
కెల్లనోర్చెద ప్రాణముల్ ♦ యేలపోవు.

సీతా! నీవు లేకున్న నాకీప్రపంచమే లేదు. ఈలోకమే పాడు !

సీ॥ తన్వి నీయానన । దర్శనంబబ్బకఁ
బూర్ణేందుగర్వంబు । బోవుటెట్లు
సుదతి నీకన్గవ । చూడ్కులు లేకున్న
నంబుజంబుల డంబు । నావుటెట్లు
మగువ నీమాటల । మధురిమగ్రోలకఁ
గోకిలగరిమంబు । గూల్చుటెట్లు
కలికి నీఘనపీన । కటిస్పర్శ లేకున్న
మనసిజబాణముల్ । మాపుటెట్లు

గీ॥ నెలత నీనగుమోముక । నిముషమైనఁ
జూడకుంటినబ్రతుకుట । సున్నసుమ్మ
రాజ్యమేలతలోదరి । రాణువేల
జగడమేల యీరావణు । జంపుటేల.

లక్ష్మ—అహా! సీతామహాదేవి. చూడఁజాల, చూడఁజాల.

రాము—అంజనిసుతుఁడు నిన్ గాంచివచ్చి నీవుబ్రతికియుంటివని చెప్ప నీపై నాసలుపెట్టుకొని నిన్నుఁజూతునను కుతూహలముతో సర్వసైన్యంబులఁ జేర్చుకొని కొండంతయాశతో వచ్చియుంటిని. ఇంతలోఁ బిట్టపిడుగువలె నింతచేటుపుట్టనేల. రావణాదులఁగూల్చి మాసీత మెప్పులఁబొందుదునని యువ్విళ్లూరుచుంటిని. ఇంతలో నీదురంతమేలవచ్చె. నా జీవితేశ్వరి, నామనోహారిణి, నేఁజూచుచుండ నేలఁగూలె. నేబ్రతికిన ప్రయోజనమేమి. ఈ రాకా నిశాంకవదన! ఈకుందరదన పైఁబడిప్రాణంబులవిడచెద.

గీ॥ పరిణయంబాదిగా నన్నుఁ । బాయ వెపుడు
నేఁడు పోనేల నన్ బాసి । నీరజాక్షి !
వచ్చుచున్నాఁడ వెన్ వెంట । వలదు పోవ
నాగుమాగుము నాకొఱ । కబ్జవదన.

లక్ష్మణా! నీవదెన మనల నిరాధారులఁ జేసిపోయెఁగదా! పాపపు

విధి నేమనవలయు. నాతలోదరిని బాసి నేనీలోకంబున నొక యరనిముషమైన నుండనోప. ఈజాళువాగాత్రికి నేఁజేయు ప్రత్యుపకారము తిలోదకంబుదక్క వేరుకాన్పించదు. లవణా సింధుజలంబుల దోసిటఁబోయుము.

సీ॥ తల్లిదండ్రులఁబాసి - తన్వి నావెంటను
వచ్చినఫలితమా - వనజనేత్రి!
పదునాల్గువత్సరాల్ - పడరానికష్టముల్
పడుటకుఫలితమా - పరమసాధ్వి
చెంగటనిల్చినా - సేవచేతునటంచుఁ
జేరినఫలితమా - చంచలాక్షి
పతిదైవమనినమ్మి - పతితోడనడవులఁ
బాల్గొన్నఫలితమా - పాపరహిత
గీ॥ భూషణాదులనిచ్చుటో - పొలతినీకుఁ
బుష్పగుచ్ఛముల్ గుచ్చుటో - పుణ్యశీల
ఇంతకన్నను నాచేత - నేమికాదు
యుదకతర్పణమర్పింతు - నువిదనీకు.

హా! మనోనాయకి! అడవుల నాతో నెన్నరాని నిడుములఁబడినందుకు సన్నుదైవముగానమ్మి సేవించినందుకు నీకు తిలోదకము దక్క వేఱుప్రత్యుపకారముచేయఁజాలనైతినా? తిలోదరీ! నీవిట్లు ధూళిదూసరంబగు నేలఁబడియుండఁజూచి భరింపఁగలనా.

సీ॥ కరకుకత్తులఁబోలు - కఠినంపురాపట్లు
పట్టుపాన్పానీకుఁ - బవ్వళింప
పటుభయంకరమైన - భండనభూములు
కేళీగృహంబులా - క్రీడసలుప
పీనుగువెంటచే - భీతిఁగొల్పెడునేల
యుపవనసీమయా - యువిదనీకు
రక్తకలితమైన - రాపాడిపంకంబు
చందనలేపమా - చాననీకు

గీ॥ కులుకుమోహములసదన ॥ కుందరదన
మందగజయానపూర్ణిమా ॥ చంద్రవదన
జనకరాజపుత్రివిశాల ॥ జలజనేత్రి
హేమగాత్రినోర్వగలనే ॥ హీనమబల !

లక్ష్మణా ! ఈభూజాతకు నేనొనరించవలసినది యగ్నిసంస్కారం బొక్కటె. అది నాచేతులారనొనర్చి యందే నాప్రాణత్యాగం బొనరించెద.

లక్ష్మ—అన్న! నీకుఁదెలియని ధర్మములేమున్నవి. నాకేమొ యిది యొకరాక్షసమాయగాఁ దోచుచున్నది. మనలదుఃఖములఁ దోఁసినూచి యానందింప రాక్షసులు పన్నినమోసమని తెలంచెద. లేకున్న నీవు ధర్మపరుండవు.

గీ॥ ధర్మమేజయమని వేవి ॥ ధములఁబల్కు
వేదవితతి యామాటలు ॥ వేఱుకావు
ధర్మపరుఁడవు నీకెట్లు ॥ తప్పుజయము
వదిన కీపాటువచ్చునా ॥ పెంతమాను.

(విభీషణుండు ప్రవేశించి)

విభీ—శ్రీరామచంద్ర! ఇది విద్యుజ్జిహ్వానిర్మితమగు మాయరూపము. మీ దేవేరి సీతామహాదేవియని నమ్మకుము. ఇది మాయ రూపము. దేవా ! అటుచూడుము. (మాయసీత మాయమగును.) నామాటకు తార్కాణముగా నారూప మదృశ్యమగుచున్నది.

రాము—ఔరా ? ఇంద్రజిత్తెంతమోసకాఁడు ?

విభీ—వానినుపేక్ష జేసినఁ జేటుతప్పదు. మీరీదుఃఖమునఁబడియుండ మిమ్ముజయించుట కేదో యాగమొనరించుచున్నట్లున్నది.

(కపిలుఁడు త్వరగావచ్చి)

కపి—శ్రీరామచంద్రా? త్వరపడుము ! త్వరపడుము. రహస్యముల కనిపెట్టుటకు లంకలో నుద్యోగనెపంబునఁ బ్రవేశించితి. విద్యు

జిహ్వునితో గపటస్నేహ మొనరించి వారి లోతుపాతు తెలుసుకొంటి. మాయసీతాదేవిరూపము నిర్మించి మీయెదుట ఖండించిరి. సమయముదొరికె కదాయని నికుంభిలాయాగము చేయుచున్నారు. పూర్తిజెందెనా మేఘనాథుండజేయుండే. లెమ్ము లెమ్ము.

లక్ష్మ — అన్న మీకింతదుఃఖము దెచ్చిపెట్టి మోసమొనరించిన మహాపాతకుని నానిశితశరఘాతంబుల నేలఁగూల్చెద. సెలవొసంగుము.

విభీ — తప్పక మనలక్ష్మణకుమారుండీకార్యము నెరవేర్చును. వాయునందనుని సహాయముండవలెను. నేను వెనువెంటఁగాచియుందును.

రాము — తమ్ముఁడా! నీకుజయమగుఁగాక. మనవిభీషణ హనుమంతుల మరి నీకిచ్చవచ్చిన యోధవీరుల వెంటఁగొనిపొమ్ము. శీఘ్రముగ జయ మందిరమ్ము.

లక్ష్మ — చిత్తము (నమస్కరించును.)

(అందరు నిష్క్రమించిరి.)

రెండవరంగము పూర్తి.

## తృతీయాంకము — మూఁడవరంగము.

## నికుంభిలాయాగము.

(ఇంద్రజిత్తు మేఘములఁగల్పించుకొని వానిమధ్య యాగము చేయుచుండును. విద్యుజ్జిహ్వుఁడు మహిషముఖుఁడు కావలికాయుచుండుట.)

విద్యు — మహిషముఖ! జాగ్రత్తతోనుండవలయు. శత్రువులు మనరాక్షసమాయలమించిన మాయకాండ్రవలెనున్నారు. వీరిల్లుకూల! కపిలాచార్యుఁడు మహామాయావి, దొంగలలో గలదొంగ.

మహి—అమబ్బులలో నేనా, మన యువరాజా.

విద్యు—నోరు మూయుము. గోడలకుఁ జెవులున్నవి. మాట్లాడకు. ఉషార్.

మహి—ఫారా వుషార్.

విద్యు—ఉషార్.

మహి—ఫారా వుషార్ (కత్తులతో నటునిటుఫారాయిచ్చుచున్నారు. వెనుకనుండి విభీషణుఁడు, లక్ష్మణుఁడు, హనుమంతుఁడు, కపిలుఁడు ప్రవేశించుచున్నారు.)

కపి—(నోరు మూసుకొని) వ్రేలితోఁ జూపుచు) అదే! అదే!

విభీ— గీ॥ మేఘములఁజాటుపెట్టుక ౘ మేఘనాధుఁ
డచటఁజేయుచునున్నాఁడు ౘ యాగమొకటి
పరిసమాప్తిని జెందినఁ ౘ బట్టఁదరమె
కొట్టుమాతని యస్త్రంపు ౘ కోలబూని.

(లక్ష్మణుఁడు బాణమేయు మేఘములు ముక్కముక్కలై పోవును. రధారూఢుఁడై యింద్రజిత్తు కనిపించును.)

మహి—(విద్యుజిహ్వుని కౌగలించుకొని) ఇదేమిపిడుగో బాబో (యేడ్చుచున్నాఁడు.)

లక్ష్మ—

చ॥ నిలునిలుపారిపోకునిను ౘ నీరధ నీరదపాళితోడఁ గో
సలవిభుపాలికిప్పుడతి ౘ లాఘవమొప్పఁగఁ జేర్తుఁజూడు మా
తులువ! ఘనార్భటిన్ చిలువ ౘ తూపులఁగట్టితి నంచుగర్వివై
యిలసుత గొంతుగోసినటు ౘ లెట్లునటించితి వెంతద్రోహివో.

ఓరీ రావణీ! బృందారకుల జయించితినని విర్రవీగకుము.

ఇంద్ర—ఓరీ నరాధమ!

గీ॥ చేతకానితనంబునఁ ౘ జేటువచ్చెఁ
జెనటి! పోహమ్ము లేదురా ౘ సిగ్గునీకుఁ

జచ్చినాఁడవె నాకస్త్రకశక్తివాఁడు
యుద్ధమా నీకుచచ్చుటే సిద్ధమిపుడు.

ఓరీ నాయుద్ధనైపుణ్యము జూడుము. (రథముతో నాకాశంబున కెగిరిపోవుచున్నాఁడు.)

లక్ష్మ—నీమాయాయుద్ధము కట్టిపెట్టుము. రథంబుతో నిన్ను నేలఁబడవేసెద. (బాణమువేయఁగా రథము నేలఁగూలును. ఆకాశమందే యింద్రజిత్తుయుండి మరియొకరథ మెక్కుట.)

విభీ—రామానుజ! వీడు సామాన్యుఁడుకాఁడని చెప్పలేదా? అస్త్రప్రయోగంబునఁగాని వీనిమాయానశించదు.

లక్ష్మ—అట్లైన నాగ్నేయాస్త్రము ప్రయోగించెద. (రథము దగ్ధమై నేలఁబడును.

(ఇంద్రజిత్తు క్రిందకు దిగి విభీషణునితో)

ఇంద్ర—తండ్రీ!

ఉ॥ నాన్నవుకావె యాదనుట నాథుని సోదరుఁడౌటనాకు చి
న్నాన్నవుకావె దానవవినాశముజేయఁగజూతు నాయమే
నాన్న! విరోధివర్గముల నమ్మినఁ దప్పకఁజేటుపుట్టు మా
నాన్నకు నీకు భేదమని నామది నమ్మితె యెన్నడైననే.

శాత్రవులలోఁ జేరి మాకుట్టువెలిఁబెట్ట ధర్మమా? లంకలో జన్మించితివి. నీకు మామోటు మేలులేదు? సోదరవాత్సల్యత, పుత్రవాత్సల్యత నీకు లేకపోయెనే.

గీ॥ తండ్రివి సుతులఁజంపఁగాఁ దలపులేల
జ్ఞాతివైరము ముఖ్యమా లాతిపగకు
సుతుల మిత్రుల బంధుల సోదరాళిఁ
జంపఁజూచెదు నీవట్టి చెంటివకట.

విభీ—మేఘనాథ! నీవన్నట్లు.

ఉ॥ రాక్షసులందుఁబుట్టితిని రాక్షసనైజముతేదునాకు నా
రాక్షసమున్ ద్యజించితిని రాక్షసనీతికి దూరమైతి నీ

రాక్షసమేలరా క్షమియు? రాక్షసమాటలు నిశ్చయంబు రామా రాక్షస! ధర్మమేయది? రాక్షసరాజ్యము వీరభోజ్యమూ.

నామాటలు నమ్ముము. నాకు ధర్మమే ప్రధానము. మీతండ్రి నాసోదరుఁడు. ధర్మము పరిత్యజించెను. ఋషుల బాధించెను. సురలఁ జెరఁబెట్టెను. భూసురుల వేధించెను. స్త్రీల నిర్బంధించెను. వీనికి పోఁగాలమెట్టిదో? శ్రీరాముఁడు, పరంధాముఁడు, సకలశత్రువిదారితరాముఁడు, దనుజవననిర్ధూమధాముఁడు, రణరంగభీముఁడు, రఘుకులాంబుధిసోముఁడు, సకలసద్గుణధాముఁడు, దశరథరాముఁడు, అట్టి మహావీరుని నారీమణిని గొనివచ్చి దవానలంబు చేఁగట్టుకున్నాఁడు. ఆబడబాగ్నికి సకలదనుజానీక మింధనమగుచున్నది.

లక్ష్మ—రాక్షస! నానిశితశరసందోహంబున కోర్చితివేని నిన్ను మెచ్చెదను.

ఇంద్ర—ఓరీ వ్యర్థప్రలాపీ! రారమ్ము నాశౌర్యము జూచెదవు.

లక్ష్మ—రారమ్ము నాభుజబలంబెరింగెదవు.

(ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

హను—లక్ష్మణకుమారుని యుద్ధనైపుణ్య మేమనవచ్చు. అలుగు తీయుట, తొడుగుట, వేయుట గానరాదు. కనురెప్పపాటులో వేనవేలు బాణములు కురియుచున్నవి. మేలు లక్ష్మణకుమారా మేలు.

విభీ—వాయునందనా! అటుచూడుము. తలలువంచి విగతాయుధులగు రక్కసులు పరుగిడుచున్నారు.

హను—అల్లదిగో ఇంద్రజిత్తును సంహరించి రామానుజుండు ప్రళయకాలాంతకునివలె నిలిచియున్నాఁడు. కలుసుకొనుదము రండురండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

మూఁడవరంగము పూర్తి.

## తృతీయాంకము—నాలగవరంగము.

## లంకలో మందిరము.

(రాముని వేషముతో మహిమముఖుఁడు, విద్యుజ్జిహ్వుఁడు ప్రవేశించుచున్నారు.)

విద్యు—మహిమముఖా!

మహి—అబ్బీ, నేవలుకను సుమా! శ్రీరామాయని పిలువుము.

విద్యు—మరచితిని. శూర్పణఖవచ్చినప్పుడు పొరపాటున నిన్ను పేరు పెట్టి పిలచితినా క్షమింపుము.

మహి—అప్పుడుమట్టు కట్లనకుము. ఆతొత్తుకూతురు నావెనుకలు పిండిచేసి, నకుము విరుగఁదన్ని మరిపోవును.

(సీతవేషముతో శూర్పణఖ కపిలాచార్యుఁడు ప్రవేశించుచును.)

విద్యు—ఊరుకో—అదుగో—

కపి—అమ్మాయి! శ్రీరాముఁ డచ్చటనున్నాఁడు చూడుము.

విద్యు—నీవలలో నీముండ బాగాపడినది.

కపి—అరవకు. ఎటులనో గొప్పయుద్యోగం దొరికితే నేతరింతును. కొత్తయేల! నీకొఱకు రాముఁడు శ్రమపడి లంకకువచ్చినాఁడు. సమీపించి కౌగలింపుము.

మహి—దీనికమవుడక! సీతను చంపిపుట్టినది. నేనే దగ్గరకుఁబోయెదను.

కపి—శ్రీరామచంద్రా! సీతామహాదేవి మీనిమిత్తమువచ్చియుండగా నెదుర్కొని గ్రహించవేమి. అమ్మాయి సిగ్గుపడకుము.

* ఇతఁడు పాతరాముఁడే! నీయాలింగన మపేక్షించుచున్నాఁడు.

విద్యు—మహిమ—(చెయ్యి కొరుక్కొని) శ్రీరామ—

మహి—కొంపతీసెదవాయేమి? సీతా నిన్నింతకష్టము పెట్టినందుకు క్షమింపుము.

శూర్ప—నాధా! బంగారులేడి నిమిత్తము మిమ్ము శ్రమపెట్టినందుకు క్షమింపుడు.

కపి—అమ్మాయి మాటలతో నాకొరిమె తీరునదికాదు.

విద్యు—మామహిషముఖుని యదుర్దృష్టము. మహారాజు తోబుట్టువును గాగలించఁబోవుచున్నాఁడు. మర్మము తెలుసుకున్నదీ! సున్నములోనికి వెముకదొరకదు.

కపి—నేపెట్టినముహూర్తము బహుమంచిది. పదిరెండు నెలలకుఁ గలుసుకొనుచున్నారు. ముహూర్తము మించనివ్వకుఁడు

శూర్ప—బ్రాహ్మణోత్తమా! నాహస్తము నానాథునిచేతిలోఁ బెట్టుము.

మహి—నాపంట పండినది.

కపి—(చేతులుకలుపుచు) నాయుద్యోగంమాట మరచిపోకుము.

విద్యు—మహిషముఖుని పిలిపింతునా?

శూర్ప—ఆతుచ్ఛుఁడెందుకు?

మహి—ఆమాటలెందుకు పోనిమ్ము- (దణ్ణముపెట్టి) క్రొత్తచూపులు చూచెదవేల? చెలి యిటురమ్మీ.

శూర్ప—నన్ను గుర్తించెనా యేమి?

కపి—కొంపముంచకు. పదిరెండునెలలకే క్రొత్తచేసినదా? మా యావిడనువిడిచి పదునాలుగేళ్లైనది. నాకుఁ గ్రొత్తయన్నమాటే లేదు.

మహి—అదిగో కయ్యాతలము. అటుపోదమా? ఈమహిషముఖుఁడు నిన్ను సుఖపెట్టకమానఁడు.

శూర్ప—ఓరీ దొంగవెధవా! నీవా (అని కొట్టును.)

మహి—అయ్యో! చస్తిని.

(అందరు పారిపోవుచున్నారు. మహిషముఖుని యీడ్చుకొని పోవును.)

నాలగవరంగము పూర్తి.

## తృతీయాంకము—అయిదవరంగము.

### యుద్ధభూమి.

(విభీషణుఁడు, లక్ష్మణుఁడు, హనుమంతుఁడు ప్రవేశము.)

విభీ—రామానుజ! మేఘనాథుని సంహరించుటచే మీవిఖ్యాతి లోకవ్యాప్తమయ్యె.

లక్ష్మ—సఖా! నీవు మాలోనుండ విజయమున కేమికొఱత.

హను—విభీషణా! సకలదానవ పట్టాభిషేకమునకు సంసిద్ధుఁడవు కమ్ము.

విభీ—మహావీరుండవు నీవుండ మఱియొకవిధమగునా!

(రావణుఁడు ప్రవేశము.)

రావ—ఓరీ! విభీషణ! కులద్రోహీ! సముద్రంబున బడబానలంబు పుట్టినట్లు దానవకులంబున నీవు జన్మించితివి. శత్రుమధ్యంబునఁజేరి జ్ఞాతివైరముబూని నీజన్మస్థానమగు లంకను వినాశము నరించుచుంటివి.

విభీ—అన్నా! శాంతింపుము. సావధానుండవై నామనవియాలకింపుము. త్రిలోకైకధనుర్ధరుండు, పరశురామ గర్వాంధభాస్కరుండు, వాలి గర్వహరణ ప్రసిద్ధభుజబలుండు, సకలదానవ సంహారదీక్షాపరుండు, సర్వశత్రుభయంకరుండు, ముల్లోకవీరుండు, శ్రీరాముండు, సామాన్యనరుండు కాఁడని యిప్పుడైన నీకుఁదోచినదా? మహాబలుఁడగు మనసోదరుఁడు కుంభకర్ణుఁడొక త్రుటిలో నంతమొందె. నాకాధిపుజయించిన వీరాధివీరుండు నిమిషమాత్రమున మడసె. ప్రహస్త, ధూమ్రాక్ష, యకంపన, యతికాయ, నరాంతక, దేవాంతక మహాయోధులు నశించిరి. నీవు యొక్కండవే మిగిలియుంటివి. ఇప్పుడైన సీతామహాదేవి నొసగి శ్రీరాముని శరణుజొచ్చితివా, యాత్రిలోకజట్టి, యాదశరథపట్టి, నీకభయమిచ్చి నీచే సకలభువనముల నేలించు. లేదా నిన్ను మట్టుబెట్టుట నిజము, నిజము. సోదరవాత్సల్యముచే నే మరల నిన్వేడుచున్నాఁడ.

రావ—ఓరీ కులద్రోహీ ! నీ శ్రీరంగనీతులఁ గట్టిపెట్టుము. సుత హితమిత్రబాంధవులు నశించిరి. నేనొక్కఁడ జీవించిన నేమిప్రయోజనము. నేమడసిన నీస్మశానవాటికను నీవే యేలికొనుము. ఇట్టి దానవవినాశమునకు హేతుభూతుండవగు నిన్ను యీమయ దత్తంబగు శక్తికి బలియిచ్చెదను. (శక్తినివిసీ)

లక్ష్మ—ఓహో ! అభయమిచ్చితిమే. ఇతని ప్రాణరక్షణమువశ్యము కర్తవ్యము.

రావ—

ఉ॥ ఎక్కడికేగెదీవు నిలు ♦ వెవ్వరువచ్చెద రడ్డమిచ్చుటన్
నిక్కులునిక్కులొకు బహు ♦ నీతులు నేర్చితివంచుఁ బేలగా
మక్కువబుట్టునే దనుజ ♦ మారణకర్మకు నోర్వనేర్తునే
చిక్కితివింకఁ జచ్చెదవు ♦ చిక్కులుతీరును నాదుశక్తిచేన్.

లక్ష్మ—మిత్రమా భయపడకుము. భయపడకుము.

(అడ్డురాగా శక్తిచే మూర్ఛిల్లుట.)

హను—రావణాధమా ! పారిపోక నిలుపుము. (రామ, రామ, రామసీతా) వెంటపడుచున్నాఁడు.

రావ—వీని బాధింబడక తప్పించుకొనుటే మంచిది. (పారిపోవుచున్నాడు.

(రాముఁడు ప్రవేశించి లక్ష్మణునిపైఁబడి)

రాము—తమ్ముఁడా ! ఈరణభూమి నిన్ను బలికోరెనా ? నిన్ను లంక తనపొట్టఁబెట్టుకొనెకదా ? నన్నువిడిచి యయోధ్య నొక నిముషమైన నుండనని వెంటవచ్చితివే ? ఇప్పుడు నన్నెట్లు విడిచి పోవనెంచితివి. చతుర్దశభువనైక ధనుర్ధరుండవు. ఈతుచ్ఛరక్కసునిశక్తికి లొంగిపోతివా ? ధర్మమేజయమని నాతో వాదించితివే. సకల ధర్మాచరణ ధురీణుండవు. నిన్నేల నీధర్మము కాపాడదయ్యె. ఇక నాకీరణంబేల ? ఈభార్యయేల ! ఈరాజ్యమేల ?

సౌమిత్రీ! నీమిత్రభావముచే నాదుఃఖములన్నిటిని విడిచిపెట్టితిని. ఇక నొకనిముసమందు నిలువఁగలనా?

సీ॥ అన్నమాటకు నొక ॥ యడుగైన దాటని
పరమభక్తుని నెట్లు ॥ బాయఁగలను
పిన్నమ్మ యెదురయి ॥ ప్రియసుతుఁ డేఁడన
నేమని తెల్పుదు ॥ నెట్లు జూతు
పతియేడి రాఁడయే ॥ పాపమా యన విని
యూర్మిళ నేవిధి ॥ యూరడింతు
సౌమిత్రి యేఁడని ॥ సోదరు లడిగిన
నేమని చెప్పుదు ॥ నేమి సేతు
గీ॥ బ్రతికియుండియు జీవముల్ ॥ భారమాయె
తమ్ముఁడా నిన్నుఁ బాసి నా ॥ తరమె మనఁగ
రాజ్యమొల్లను ధనమొల్ల ॥ రమణినొల్ల
నీవు పోయెడి లోకమే ॥ నేను జొత్తు.

(సుగ్రీవ సుషేణులు ప్రవేశము.)

సుగ్రీవ! నాకొఱకు బహుశ్రమపడి నీభక్తివిశ్వాసములఁ జూపితివి. నాచిన్నితమ్ముని రణభూమినిడించి నేమరల నయోధ్యకుఁ బోనొల్ల. ఈసైన్యంబులకు సెలవిచ్చి కిష్కింధకుఁ జేరుము. అయ్యో! విభీషణ! కొండంతయాశతో నన్నుఁ జేరితివి, నీయాశలు నీటఁగలిపి నాముద్దుతమ్ముని వెంటఁ బోనెంచితి. క్షమింపుము. నేలంకసాధింపనోప! అయోధ్యానగరంబు నీకొసంగెద. పాలింపుము. నాతమ్ముఁడు లేకున్న నాకీజగమే పాడు. ఈజీవితమే నిష్ప్రయోజనము. హా! సౌమిత్రీ!

సుగ్రీ—రామా! సుషేణ! ఈరామభూపాలుని విషాదము చూడఁజాల! నీవెరుఁగని దివ్యౌషధములు లేవు. ఈలక్ష్మణకుమారుఁడు మూర్ఛిల్లెనో మరణించెనో పరీక్షించి తగునౌషధముల నడపింపుము.

సుషే—(లక్ష్మణునిహస్తముపరీక్షించి) శ్రీరామచంద్రా! దుఃఖం పకుము. మనసౌమిత్రి మూర్ఛజెందెను. ప్రాణభయములేదు. ఇందునకు మృతసంజీవిని దేవలయు. ఇక్కార్యంబునకు హను మంతుఁడు తప్ప పరులు సాధింపలేరు. సముద్రముదాటి యుత్తరాభిముఖుండై పోవంబోవ హిమవంతము కనుపించు. దానికవ్వలఁ గాంచనపర్వతముకలదు. అందు కైలాసశిఖరముం డును. ఆశిఖరమందు నౌషధపర్వతమున్నది. దానియందు దీప్తివంతములగు మృతసంజీవిని, శల్యకరణి, సంధానకరణి స్వావ ర్ణకరణి యను దివ్యౌషధులుకలవు. వానిని సూర్యోదయమునకు ముందుఁ దెచ్చిన సౌమిత్రి జీవించును.

రాము—మారుతీ! సముద్రము లంఘించి సీతనుజూచివచ్చిన మ హోపకారివి. సంజీవితెచ్చి నాకుసోదరభిక్ష పెట్టవలయు.

హను—రామ-రామ-రామ-సీతా-రామ (అని పరుగెత్తును.)

విభీ—లక్ష్మణకుమారుని ముఖవర్చస్సు యెంతమాత్రము తగ్గలేదు

సుగ్రీ—జీవకళ ప్రత్యక్షముగాఁ గన్పించుచున్నది.

సుషే—నేచెప్పలేదా ? ప్రేతకళ యెంతమాత్రము కానరాదు.

రాము—అట్లు తూర్పుదిక్కు పరికించిచూడుము.

గీ॥ కులముపై సూర్యునికరముఁ | గూర్మిలేదొ
చూడుమదె యుదయించెను | సోదరుండు
మూర్ఛదేరకముందె యా | మూర్ఖునిశిత
బాణములపాలుజేసెద | బంధువనక.

(బాణము సంధించపోగా)

సుషే—శ్రీరామచంద్రా! శాంతింపుము. అతఁడు సూర్యుఁడుకాఁ డు. మన హనుమంతుఁడు. దివ్యౌషధములు గానరానందున పర్వతమునే పెకలించి తెచ్చుచున్నాఁడు.

హను—రామ, రామ, రామ, సీతారామ (సంజీవిపర్వతముతెచ్చును)

(సుషేణుఁడు మందుపోయు లక్ష్మణుఁడు మూర్ఛ తేరును.)

లక్ష్మ—ఓరీ! రాక్షసాధమ! నిలు-నిలు-ఇంకెక్కడికిఁబోయెదవు

ము—ముద్దుతమ్ముఁడా! శాంతింపుము. ఆరక్కసుఁడు పారిపోయి నాఁడు. వానరోత్తములారా! మీరందరొక్కుమ్మడి లంకపైఁ బడి రావణుని యుద్ధమునకుఁ బ్రేరేపింపుఁడు. పోదమురండు.

(అందరు నిష్క్రమించిరి.)

అయిదవరంగము పూర్తి.

త్రుతీయాంకము.—ఆరవరంగము.

యుద్ధభూమి.

రాము—మిత్రమా! లంకలో నాకల్లోలమేమి?

విభీ—దేవా! లోకవిద్రావణుండగు రావణుండు యుద్ధసన్నద్ధుఁడై వచ్చుచున్నట్లున్నది తాము సంసిద్ధులుకండు.

(రథముతో మాతలి ప్రవేశము.)

మాత—దేవా! అవధరింపుము. నేను దేవేంద్రుని రథసారథి. మాతలియనువాఁడ. సహస్రాక్షుఁడు తమకై యీదేవరథము ను బంపినాఁడు. దీనినధిరోహించి లోకకంటకుండగు రావణుని దెగటార్పుము.

రాము—మహాప్రసాదము. (రథమునకు నమస్కరించును.)

(అగస్త్యుఁడు ప్రవేశము.)

అగ—శ్రీరామచంద్రా! సకల శత్రుసంహార హేతుభూతంబగు యాదిత్యహృదయ మను దివ్యమంత్రం బుపదేశింపవచ్చితి. దీని గ్రహించి సూర్యభగవాను నర్చించితివా నీకు జయముతప్పదు.

రాము—(నమస్కరించి) ఋషిపుంగవులయానతి శిరసావహించెదను. (ఋషి చెవులోనేదే చెప్పుచున్నాఁడు)

రాము—ఓ సూర్యనారాయణ- భగవానుఁడ- నహాస్రిమయూఖ.

శ్లో॥ జయాయజయభద్రాయ హర్యశ్వాయ నమోనమః।
నమోనమస్సహస్రాంశో ఆదిత్యాయ నమోనమః।
బ్రహ్మేశానాచ్యుతేశాయ సూర్యాయాదిత్యవర్చసె।
భాస్వతే సర్వభక్షాయ రౌద్రాయవపుషేనమః॥

అగ—రామభూపాల ! నేఁడరిగెద. రావణాదులు చచ్చినవారే !

(అందరు నమస్కరించిరి)

(రావణుఁడు రథారూఢుఁడై ప్రవేశము.)

హను—(రాఘు-రామ-రామసీతా) దేవా! ఇతఁడే త్రిలోకకంట కుండు. దేవదానవభయంకరుండు. యజ్ఞయాగాది సత్కర్మవినా శకుండు. పరవనితా సంభోగదీక్షాపరుండు. సీతాదేవ్యాపహా రుండు. మునిపత్నీతస్కరుండు. పంక్తికంధరుండు. వీనివధింప నాకు సెలవొసంగుము.

రాము—మారుతీ ! నీభక్తివిశ్వాసములు నేనెరుగనా ? వీనితో రణ మొనరింప నాకుఁ గుతూహలమగుచున్నది.

(రావణునితో)

ఓహో! చోరాగ్రగణ్యులో! నేటికి ప్రత్యక్షమైతిరి. పారిపోక నిలువుఁడు.

రావ—ఓరీ ! నీచ !

గీ॥ తస్కరుండనో నీతలఁ ద్రుంచువాఁడ
నో మారెవఁడనో చూచెద నోరిమూర్ఖ
మాటలేటికినిల్వు నిన్ మట్టుబెట్టి
దానవాళికి మోదంబు దార్తునిపుడె.

రాము—

ఉ॥ ఒంటరిపాటునన్ జడవి నుండగఁజూచి తలోదరిన్ మహా
కంటకవృత్తిదెచ్చితివి కాలునిపాశము చుట్టుకొంటినీ

కంఠమునందు నీవపుడ ♣ కంటికిఁదోచిన నింతయేలరా
తుంటరి ! పోటుబంటనని ♣ దుర్బల ! యేటికిఁ జిందులాడెదో.

వ___ఓరీ ! లజ్జలేకుండుట నీకా ? నాకా ? ఇ.త తెలివితక్కువ వాఁడవగుటచే___

సీ॥ రాజ్యవిచ్యుతుఁజేసి ♣ రమణితో నడవికి
బలిమిని గెంటె నిన్ ♣ భరతుఁడలిగి
రాము___అసురులతో నిండి ♣ యడవులుండుట నన్నుఁ
బంపెను వధియింప ♣ భరతుడలరి
రావ___భార్యనుఁజెరబట్టి ♣ బంధించి తెచ్చితి
బాలిశ ! సిగ్గేల ♣ పడవు నీవు
రాము___ఇంట నెవ్వరు లేక ♣ నొంటరినుండగా
శునకము రీతిగాఁ ♣ జొచ్చి గృహము
గీ॥ దెచ్చినాఁడవు వ్రుచ్చిలి ♣ తస్కరంబె
నీకు నీమీఁదివారికి ♣ నేనుచూడ
వనధిదాటి లంకకుఁ జేర ♣ వశమె నీచ
మించిపోలేదు మాటలు ♣ మీరనేల.

రావ___ఓరీ ! నీచమానవ! వీరాధివీరుండనని ప్రగల్భములేలఁ బలికెదవు. చెట్టుచాటున పొంచి వాలినేసిన ప్రతాపము చాలదా ? కామించివచ్చిన నాసోదరిని ముక్కుకోసిన రసికత్వము చాలదా? చిన్నమ్మ పొమ్మనఁగానె వనములఁజొచ్చి యాకలములు తిని ప్రాణముల నిలుపుకొన్న మగటిమి చాలదా? కబంధుని బాహుపంజరమునఁబడి భీతిచే పరితపించిన ధైర్యసాహసములు చాలవా? ఖరుండు వీరావేశంబున మీదకురా వెనుకంజ వేసిన క్షాత్రము చాలదా? నాసుతుఁడు మేఘనాధుఁడు నాగపాశంబుల బంధింపఁ దల్లడించిన శూరత్వము చాలదా? చతురంగబలంబులు లేక కోతి కొండముచ్చు పిందులఁగూర్చుకొన్న ప్రజ్ఞ చాలదా?

హను___రాక్షసేశ్వర! శ్రీరాముఁడు సామాన్యమానవుఁడు కాఁడని నీకింకను దోచలేదుగా? నీమూర్ఖతకుఁ జింతించవలయు. శ్రీమ

న్నారాయణాంశ సంభూతుఁడగు రాముని సేవించి ధన్యుఁడవు కమ్ము.

రావ — ఏమి ? ఈమానుషపశువా ! శ్రీమన్నారాయణుండు.

గీ॥ ఖరముగోవౌనె కపివర ! కాకికోకి
లౌనె, శునకములు సింహమౌనె కలప
నత్త నీరజమౌనె యనాథప్రేత
నరుఁడు నారాయణుండౌనె నమ్మనవునె.

వీఁడా ! తండ్రిపాలిటి మృత్యువు. సోదరులపాలిటి శత్రువు. సతుల పాలిటి యముండు. శబరి యుచ్ఛిష్టభక్షణాదిదోషపరుండు. కోఁతి కొండముచ్చుల దొర. పొంచి వాలినేసినదొంగ. ఇల్లువాకిలిలేక నడవులఁదిరిగెడి దేశదిమ్మరి. వీఁడానారాయణుఁడు.

లక్ష్మ — రాక్షసా ! నీప్రజ్ఞను, నీయైశ్వర్యమును; నీపాండిత్యమును, నీవిలువిద్యానైపుణ్యమును, నీశాస్త్రసామర్థ్యమును, సింధుపరివేష్టిత నీనివాసంబును, నీయపూర్వవరంబులను, త్రిలోకవిక్రములగు నీసుతసహోదరులను దలచుకొమ్ము. వీరినందఱి మట్టుపెట్టినజెట్టి. నిన్నొక యరఘడియలో నేలంబడఁగొట్ట సంసిద్ధుఁడై యున్నమేటి. నారాయణాంశసంభూతుండు గాకుండిన నోరులకు సాధ్యమగునా. ఇప్పుడైన మించలేదు. సీతామహాదేవి నొసఁగి శరణుజొచ్చితివా క్షమింపకపోఁడు.

రావ — ఈనరపసరము క్షమించువాఁడు. రావణచక్రవర్తి క్షమింపఁబడువాఁడునా.

రాము — రావణా ! నీకుకాలంబు సమీపించినది. ఇదిగో దివ్యాస్త్రము. నీశిరంబుల నేలఁగూల్చెదను. (శిరంబులు తెగి క్రిందపడును మరల మొలచును.)

ఇదేమివింత. నూటయొక్కమారులు వీనిశిరంబులు ఖండించితి. మరలమరలఁ బుట్టుచున్నవి.

కపి—దేవా! నేలంకలోఁ బ్రవేశించి యొకరహస్యముఁ దెలుచుకొంటిని. వీని గర్భమందమృతఘటమున్నదట. బ్రహ్మాస్త్రప్రయోగమునఁగాని వీఁడు కడతేఱఁడట.

రాము—ఇదే బ్రహ్మాస్త్రము కాచుకొమ్ము.

(రావణుఁడు పడిపోవుచున్నాఁడు.)

విభీ—హా సోదర! రావణా! లోకవిద్రావణా! సామగానపరాయణా! నవకోటి శివలింగార్చనధురీణ! వేదవేదాంగప్రవీణ! నిర్జితచతుర్దశభువనా! దేవదానవాద్భుతశరాసన! శత్రుభీకర బాణతూణీర! త్రిజగజ్జెట్టి, పౌలస్త్యపట్టి, నిర్మలతేజోమూర్తి, సకలదానవచక్రవర్తి, వందితదేవమణిమకుటప్రతిబింబపంకేరుహా, మర్దిత దైత్యదానవ దేవయోనిజసందోహా, సింధుపరివేష్టిత లంకాపాలకా! వంచిత యష్టదిక్పాలకా! మమ్మువిడచి పోవుచుంటివా? నేవిన్నవించిన విన్నపముల వినవైతివి. శ్రీరాముఁడు సామాన్యమానవుండుకాఁడని కేల్మోగిడ్చి ప్రార్థించితినే. వినవైతివి—

సీ॥ రాక్షసమూలమౌ | రావణవృక్షమున్
రాఘవవాయువు | రాల్చెభువిని
రణభీకరంబైన | రావణహస్తిని
యిక్ష్వాకుసింహంబు | లీలనుగూల్చె
రాక్షసాధిపుఁడైన | రావణానలమును
రామజలధరంబు | రట్టుబెట్టె
రాజపూజితుఁడైన | రావణవ్యాఘ్రమున్
గాకుత్స్థవ్యాధుఁడు | కలచెనకట
గీ॥ లావుచెడి యెంతలోఁగూలె | లంకయన్న!
దనుజరాజ్యముపాలింపఁ | దరమెనాకు
నెంతమోసమాయె నికనే | నేమిసేతు
నెటులభరియింతు నిన్గాంచి | నెటులసైతు.

రాము—విభీషణా! నీవు సోదరవాత్సల్యతచే శోకపరీతమానసుండవై తివి. నీసోదరుండు రణనిహతుండై యుత్తమలోకప్రాప్తి నొందినాఁడు. క్షత్రియులు యుద్ధము పేక్షించి రణరంగమందు విగతప్రాణులై యుత్తమగతిఁ జెందెదరు. నీయన్న యట్టివీరోచితమగు నుత్తమపదవినొందెను. కాలగతిచేత నకుంఠితవిక్రములు పరాజయమందెదరు. కాలానుగుణ్యముగా రానున్నమార్పులకు నీ బోటివిజ్ఞానులు పరితపింపరు. లెమ్ము. ముందుపనులఁజూడుము.

విభీ—పులస్త్యబ్రహ్మవంశ సంజాతుండగు నీరాగ్రేసరునకు యగ్నిసంస్కారంబులఁజేయ నాకు సెలవొసంగుము.

రాము—తప్పక నొనరింపుము. లంకలోఁ బ్రవేశించి స్త్రీజనంబుల నోదార్చుము. ముందుపని యోచింతమురండు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)

ఆరవరంగము పూర్తి.

---

తృతీయాంకము—ఏడవరంగము.

విశాలస్థలము.

రాము—సూరుతాత్మజా! నీవు శీఘ్రముగాఁజని నామనోహరాంగిని యిటకుఁ దోడుకొనిరమ్ము.

హను—నేను కృతార్థుఁడను—

సీ॥ సూర్యవంశజులతో ॥ సుగ్రీవునకు మిత్రి
పాశంబుకూర్చిన ॥ ఫలము నేఁడు
గోష్పదంబుగదాటి ॥ ఖప్పించిజలనిధి
భూసుతగాంచిన ॥ పుణ్యఫలము
వనచరాళినిగూర్చి ॥ వారధిబంధించి
లంకలోఁజొచ్చిన ॥ లావుఫలము
దుర్మదాంధుండైన ॥ దోర్బలురావణు
శూరతఁజంపిన ॥ శౌర్యఫలము

గీ॥ నేఁడు నను కూరరధన్యుఁడ । నేను జగతి
పుడమిసుత గాంచి రావణు । పొలియఁ జెల్చి
పోలతిమానసమంత యు । ఖ్యాంగఁ జేసి
రామభూపాలుఁ జేర్చెద । రమణినిపుడె.

(రామ, రామ, రామసీతా) వెళ్లి సీతను తీసుకవచ్చును)

సీత—నాథా! పదినెలలనుండి మీపాదసేవకై పరితపించుచున్న మీసీత యిదే ప్రణమిల్లుచున్నది.

రాము—మానినీ! నన్నంటకుము. నీవు పదిరెండుమాసములు పరాధీనవై యుంటివి. యానీచరక్కసుఁడు నీపై మిక్కిలిమక్కువ కలవాఁడు. నిన్నింతకాలము విడిచిపుచ్చునా?

సీత—ప్రాణకాంతా! నన్నిట్లన నగునా? అతుచ్చుఁడెట్టివాఁడో కంటనైనఁ జూచితినా? నామానసంబున మీధ్యానంబునకన్న వేరెరుగుదునా? ఇందుకు భూమ్యాకాశంబులు సకల చరాచరములు సాక్షులుకావా?

రాము—రమణి! నీవేమో యనుచుంటివిగాని నాకు సంశయము దోచుచున్నది.

సీత—మనోహరా! మీసంశయము దీరుటకు నన్నేమిచేయుమనెదరు? మీకృపాణముచే శిరంబు ఖండించుకొమన్నను ఖండించుకొందును. జలధిలోదుముకమన్నను దుమికెదను. అగ్నిలోఁ జొరఁబడుమన్నను జొరఁబడెదను. మీపాదములకన్న నితరమెరుగను. (పాదములమీఁదఁ బడును.)

రాము—మండుచున్న యీయగ్నిలోఁ బ్రవేశించి నీపవిత్రత చూపుము.

సీత—(అగ్నివద్దకువెళ్లి) పవిత్రుఁడనగు నోయగ్నిభట్టారక! యీ తలోదరి, యీభూపుత్రి, యీజనకరాజనందన, యీదశరధచక్రవర్తికోడలు, శ్రీరఘురాముని ముద్దులభార్య, శ్రీరామునికన్న వేరు కలనైనఁదలచియుండెనా దీని దహించి భస్మీపటలంబు చేయుము.

(అగ్ని చల్లారిపోవును. అగ్ని హోతుండును, బ్రహ్మాదులు ప్రవేశము)

అగ్ని—శ్రీరామచంద్రా! యీవిపరీతపు చేయనగునా? సీతా మహాదేవి పరమపతివ్రతాశిరోమణికదా! రావణునకుఁ గన్నెత్తిచూడనైనఁ దరమా?

బ్రహ్మ—రఘునందనా! నేనొకరహస్యము దెల్పెదవినుము. దేవయోనులకు రావణుండజేయుండగుటచే నీ నిజతత్వమింతవరకు నీకు స్మృతికిరాదయ్యె. నీవు శ్రీమన్నారాయణుండవు.

హను—రామ, రామ, రామసీతా (అని గంతులువేయును. విభీషణాదులు నమస్కరించి నిలుతురు.)

బ్రహ్మ—నిత్యుండవు, శంఖచక్రగదాధరుండవు, సకల చరాచరంబులు గుత్తియందిమిడియున్నవాఁడవు, లోకాతీతుండవు, లోకేశ్వరుండవు, యాదిదేవుండవు, సకల జగన్నాటకసూత్రధారుండవు, సహస్రనేత్రుండవు, సహస్రశిరుండవు, సహస్రబాహుండవు, విష్ణుండవు, కృష్ణుండవు, జిష్ణుండవు, రావణవధార్థంబు మానుషత్వమొందితివి. ఈ సీతామహాదేవి నాదుజనని మహాలక్ష్మి సంశయింపకఁ బరిగ్రహింపుము.

రాము—(సీతను కౌగలించుకొని) నరత్వంబుచే నిజతత్వమెఱుగకఁ దప్పాడితి క్షమింపుము. హనుమంత! నీమూలమునకదా యీ దేవిని మరలఁ గలుసుకొంటి. నీవు నాకు సోదరసముఁడవు. నిన్నాలింగనము చేసుకొనుటకన్నఁ బ్రత్యుపకారము జేయఁజాలను. (కౌగలించుకొనును. రామ, రామ, రామసీతా, రామ) విభీషణుని లంక కభిషేకమొనరించి మనము యోధ్యకుఁ బోవలయు. (విభీషణునకు కిరీటముబెట్టి హారములు వేయుదురు.)

మంగళం.

సంపూర్ణము.

## కాకినాడ నాట్యకళా విజ్ఞాన గ్రంథమండలి వారిచే ప్రకటింపఁ బడిన గ్రంథముల జాబితా.



| | | | |
|---|---|---|---|
| 1 | వ్యాసావళి | ... | రు. 1—0—0 |
| 2 | సంపూర్ణ మహాభారతము నాటకము | ... | 1—0—0 |
| 3 | శ్రీ అరవిందుని యోగసంకలనము Vol. I కర్మయోగము. | ... | 1—0—0 |
| 4 | మన్వంతిములు ... | ... | 0—12—0 |
| 5 | శ్రీ అరవిందుని యోగసంకలనము Vol. II జ్ఞానయోగము Part I | | 0—12—0 |
| 6 | విహారలీల నాటకము ... | ... | 0—12—0 |
| 7 | శ్రీ అరవిందుని యోగసంకలనము Vol. II జ్ఞానయోగము Part II | | 1—0—0 |
| 8 | వనసుందరి నాటకము ... | ... | 1—0—0 |

N. B :—ఈ యెనిమిది గ్రంథములు మొత్తముగా పుచ్చుకొనువారికి రు. 4—0—0 లకు వి. పి. గా పంపబడును.

దాల్తాబాదా గోపాలకృష్ణారావు, బి. ఏ.,

స్థాపకుడు, కాకినాడ.

